# శ్రీ రామాశ్వమేధము.

ఇది

ద్రోణంరాజు సీతారామారావుగారిచే

రచియింపఁబడి

రాజమంద్రీనివాసులును బుక్కుసెల్లర్సు నగు

కర్రా అచ్చయ్యగారిచేఁ

బ్రకటింపఁబడినది.

మొదటికూర్పు, 1000.



కాకినాడ:

స్కేపు అండ్ కో ముద్రాక్షరశాల

ముద్రింపఁబడియె.

1913.



[వెల రు 0—8—0

# పీఠిక

రామాయణగాథ నంతయు, 1 శ్రీరామజననము 2 ప్రవాసము 3 ఉద్యోగము 4 విజయము 5 అశ్వమేధము అను నయిదునాటకంబులుగా వ్రాసియుంటిని. వీటిని వరుసగానే ముద్రణవేయనెంచియుంటిని గాని, నేనీనాటకంబులు వ్రాయునప్పుడు కొందఱుమిత్రులు శ్రీరామోద్యోగంబును ముందుగా ముద్రణవేయుమని చెప్పగా ముందదియే ముద్రణయగునట్లు కావించియుంటిని. ఇప్పు డీశ్రీరామాశ్వమేధము ముద్రణయగునట్లు కావించితిని. తక్కినమూడును శీఘ్రకాలంబులోనే వెలువడగలవు. నాటకములు వరుసగా ముద్రించనందుకు చదువరులు నన్ను మన్నింతురుగాక.

ఎట్టివారి గ్రంథములయందైనను దోషంబు లుండకమానవు. ఇందుఁ గన్పట్టినదోషంబులను మన్నింపఁ గవులఁ బ్రార్థింపుచున్నాఁడ.

ఇట్లు,

సుకవి విధేయుఁడు,

డా॥ సీతారామరావు.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

శ్రీరాముఁడు—అయోధ్యాపురాధీశ్వరుఁడు.

లక్ష్మణ భరత శత్రుఘ్నులు—శ్రీరాముని సోదరులు.

వసిష్ఠు—శ్రీరాముని పురోహితుఁడు.

వాల్మీకి—సీతయొక్క ఆపత్కాలబంధువు.

కుశలవులు—శ్రీరామపుత్రులు.

పరమేశ్వరుఁడు.

మునిబాలుఁడు—లవుని నెచ్చెలి.

వీరసేనుఁడు—సేనానాయకుఁడు.

భద్రుఁడు—సేవకుఁడు.

సీత—శ్రీరాముని భార్య.





# శ్రీ రామాశ్వమేధము.

నాంది

తే॥ గీ॥ తనకుఁగల్గిన యపవాదఁ దలఁచి మదిని
నిండుఁజూలాలని తలంప కుండ ; సీత
నడవులకుఁబంపి ; పరితాప మంది ; పాత
కంబువాయఁ, బారంగయాగఁబుఁజేసి ;
సుతులఁ గుశలవులనుగాంచి యతిముదమున
బుడమి నేలినరాముండు బ్రోచు మిమ్ము.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అతివిస్తరంబేల ; (తెరవంకఁ జూచి) పారిపార్శ్వకా ! నీవొకసారి యిటురమ్ము.

పారి—(ప్రవేశించి) ఆర్యా ! ఏమిసెలవు.

సూత్రి—ఇంకను నేమిసెలవని యడుగుచుంటివా ! ఈసభా బృందంబును దిలకించినప్పుడైనను నీకు జ్ఞప్తికివచ్చుట లేదా ! ప్రతిదినంబును నీవు మందమతివగుచుందువే.

పారి—అయ్యా ! క్షమింపుఁడు. వీరేదియో నాటకప్రదర్శనంబు వీక్షించుటకై యరుదెంచి యుందురనియే నేను దలంచుచున్నాను.

సూత్ర—అందులకు సందియమేమి !

పారి—అట్లయిన నేనాటక ప్రదర్శనంబున వీరి నానందపఱుపనెంచిరి.

సూత్రి—సీతారామ విరచితమగు, శ్రీరామజనన, ప్రవాస, ఉద్యోగ, విజయ, అశ్వమేధంబులను రామాయణగాథగల యైదునాటకంబులలో నైదవదియగు శ్రీరామాశ్వమేధము బ్రదర్శింపఁదలంచితిని.

పారి—(ఆలోచించుచున్నాఁడు.)

సూత్రి—మిత్రమా ! ఆలోచింపనేల !

క॥ సీతారాములకథ యిది ;
సీతారామ కృతమగుచుఁ ♦ జెలఁగునుగాదే
భూతలమందున సభికుల
ప్రీతికిఁ బాత్రితవహించి ♦ వెలయునుగాదే.

తే॥ గీ॥ దశముఖుఁడు గొనిపోయిన ♦ తన్వి సీతఁ
దెచ్చికొన్నాఁడు రఘురామ ♦ ధీరుఁ డనుచు
రజకుఁడాడినపల్కులు ♦ రాముతోడఁ
బల్కుటెట్లంచుఁ జింతించు ♦ భద్రుపగిది
సందియంబేల నీకును ♦ డెందమందు.

సందియంబందక రమ్ము. పాత్రంబులను సిద్ధము సేయవలెను.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.





# శ్రీరామాశ్వమేధము.

## ప్రథమాంకము:

రంగము:—రాముని సౌధము—ప్రవేశము భద్రుఁడు

భద్రు—(స్వగతము)

మ॥ పురమందుండెడి వార్తలారయుటకై ♦ పొమ్మంచు నన్ జానకీ
వరుఁ డేలా యిపుడంపె నంపినను ని ♦ ర్భాగ్యుండనై యొప్పనే
నరయన్ జాకలిపోరు జూడగను నే ♦ లా! చూచినన్ జానకీ
తరుణీరత్నముఁ గూర్చి చెప్పకొను వా ♦ దంబేలవింటిన్ గటా!

ఆచాకలివాండ్రు పోరాడుకొనుచు సీతామహాదేవిసంగతినే యెత్తనేల. అక్కటా! నేనిప్పు డేమిసేయుదును. ఆరామచంద్రుండు వార్తలారసి రమ్మని నన్నే యేలపంపవలెను. పోనిమ్ము. ఈవార్త; రామునకుఁ జెప్పక యూరకొందమన్న నిది విన్నవా రెందఱో కలరు. ఎటులేని రామునకుం దెలియకమానదు. రామునకుం దెలియువఱకును నేను జెప్పక దాఁచితినేని రాజకార్యమునం దశ్రద్ధ వహించి చరించితినని రామచంద్రుం డాగ్రహింపఁగలఁడు. కావున నేనే ముందుగఁ జెప్పటమంచిది.

అన్నా! నేనీవార్త వినిపించితినేని రామునిమనం బంతయు మాఱిపోవునుగదా! విశేష చింతాక్రాంతుం డగును. చెప్పకతప్పదు. అయ్యో! ఆనీచ కులజులగు చాకలివాండ్రు తమలోఁ దామిట్లు పోరాడిరని చెప్పుటకు నాకు నోరెట్లాడును. ముందుఁబోయిన గొయ్యి వెనుకనుఁబోయిన నుయ్యి. ఏమైననుసరే నాకుమాత్రము చెప్పకతప్పదు. అదుగో! శ్రీరామచంద్రుం డచ్చటనే యొంటరిగఁ గూర్చున్నవాఁడు. పోయి దర్శించెద. (అని నడచుచున్నాఁడు.)

తెర లేచును.

(సభాభవనమున శ్రీరాముఁ డొంటరిగ నాసీనుఁడై యుండును.)

భద్రుఁడు రాముని సమీపించుచున్నాఁడు.

రాము—(భద్రునిజూచి) భద్రా! వచ్చితివా! పురంబున వార్తలేమి!

భద్రు—దేవా! దేవరకుఁ దెలియని వేమియుండును.

రాము—నేను దెలిసికొన్నంతవఱ కిదివఱకే తెలిసికొంటిని. ఇంకను విశేషంబులు నీవేమైనఁ జెప్పుదువేమో యని యడుగుచుంటి.

భద్రు—(తనలో) ఈతఁడు నాకు మరింత సంతాపంబును గలుగఁ జేయుచున్నాఁడు. ఈతనితీరు జూడగ నిదివఱకే కొన్నివార్తలు విన్నట్లు దోఁచుచున్నది. ఇఁక నేనీతనికి విన్నవార్త జెప్పకతప్పదు. అయ్యో! అంతకఠినమైనవార్త చెప్పుటకు నాకు నోరెట్లాడును! (విచారము నభినయించుచున్నాఁడు)

రాము—భద్రా! ఏమియో యాలోచించుచుంటివి! నీముఖభావము నేఁడేమియోకాని విచారంబును సూచింపుచున్నది. పురంబున వినరాని వార్తలేమియు నీవు వినలేదుకదా. అట్టిదేమైననున్నచోఁ దెలుపుము.

భద్రు—ఈమహానుభావుఁ డావార్త వినియుండియు, నేఁజెప్పుదునో లేదో యరయఁదలఁచి యిట్లడుగుచుండెనని నేను దలంచెదను. ఒకవే

ళ నేనిప్పుడు చెప్పకదాఁచితినేని నాస్వామిభక్తికి భంగమువచ్చును. (ప్రకాశముగా) దేవా! లోకు లనేకవిధంబు లనేకవిషయంబులఁ గూర్చి చెప్పకొనుచుందురు. మహాప్రభూ! లోకము మూయుటకు మూకుడు లేదుకదా!

రాము—భద్రా! నీవుచెప్పినది నిశ్చయమే. నేఁటిదినంబునఁ బురంబున నీవరసిన విశేషంబులేమి!

భద్రు—మహాప్రభూ! చెప్పటకు నోరాడకున్నది. నీచకులజు లనేక విధంబుల సంభాషింతురు. అవియన్నియు దేవరవారు వినుట పాడి కాదనియే నాయభిప్రాయము.

రాము—ఓయీ! నేనుమాత్ర మేలవినఁగూడదు. లోకులనుకొనిన వాక్యంబులే కనుక నీవావంతయు సందియంబందక చెప్పుము.

భద్రు—(చెప్పలేక కన్నీరు విడుచుచున్నాఁడు)

రాము—భద్రా! ఏమి! యిట్లుచింతించెదవు. లోకు లెవ్వరివిషయమో పలికిన పలుకులను జెప్పట కింతచింత యేల!

భద్రు—దేవా! ఎవరివిషయమో యైనయెడల నాకింత సంతాపమే యవసరము లేదు.

రాము—అట్లయినచో నావిషయమే యై యుండును. దీనికి నీవింతవిచారింపనేల!

తే॥ గీ॥ ఎల్లభూతలభారంబు ♦ నేలుచుండె
సత్యమును దప్పకంచును, ♦ జనులుకొంత
మంది చెప్పకొనుచునుందురు, ♦ మరియుఁగొంద
ఱేలడందురు, దీనికి ♦ నేలచింత.

భూతలభారంబు వహించిన నన్నుఁగూర్చి జను లనేకవిధంబులఁ జెప్పకొనుచుందురు. రాజెప్పుడును సకలజనులకును మంచివాఁడును

గాఁడు. సకలజనులకును జెడ్డవాఁడునుగాఁడు. కావున నీడెందంబునఁ గలి
గిన సందియంబును వీడి చెప్పుము.

భద్రు—అయ్యా! నేవిన్నవార్త తమకు సంతాపము గలుగఁజేయునని
నేనతిభయంబునుఁ బొందుచున్నాను.

రాము—

తే॥ గీ॥ చింతనే కూర్పఁగానిమ్ము ♦ సంతసంబె
కూర్పగానిమ్ము మేదైనఁ ♦ గోర్కెతోడఁ
బృథ్వినాయకుఁ డంతయు ♦ వినఁగవలయు
నంచు నీకునుఁ దెలియదో ♦ యంచితముగ.

భూపురంధరుఁ డెప్పుడును బురంబునగలవార్తలును, తనరాజ్యం
బున విశేషంబులును బ్రతిదినంబును నరయుచుండవలయు. నన్ను దూర్చి
జనులేదో యనుకొనిరని చెప్పుటకు నీవు సందియంబందుచుంటివి. అట్టి
సందియంబేమియు నీవందవలదు.

భద్రు—దేవా! ఏమిచెప్పుదును. మీయానతిని బూని పురంబున విశే
షంబు లరయఁబోయి చరింపుచుండ నొక్కయెడ చాకలివాండ్రు
భార్యాభర్త లిరువురును దేనికొఱకోకాని కలహింపుచుండిరి.

రాము—దానికేమి! పాపమేమియో సంసారచిక్కులచే నట్లు కలహిం
చియుందురు. అదియునుంగాక యిట్టియవస్థ ప్రతిగృహంబున నున్న
దే. (ఇంచుక యూరకొని) తరువాత నేమిజరగినది!

భద్రు—అందు, భర్త భార్యనుగొట్టి "రావణునిచేఁ గొనిపోఁబడి
యొక వత్సరంబు లంకయం దుంచఁబడిన యాసీతను మరల శ్రీరా
ముం డేలుచుండెనుగాని నేనుమాత్ర మట్లుచేయ" నని వాక్రుచ్చె.
ఇదియే మహాప్రభూ! నేవిన్న దారుణవార్త.

రాము—(నిట్టూర్పు విడిచి తనలో) అన్నా! లోకు లెట్లుచెప్పుకొను

చుండిరి. సమస్తసద్గుణపూత యనియు, సాధ్వీమణియనియు, నాడ ట్లగ్నిహోత్రుండు దెచ్చి యప్పగింప సమ్మతించితినే. అట్టిపతివ్రతాశిరోమణిం గూర్చి లోకులిట్లాడఁజొచ్చిరే. అక్కటా ! ఈదుర్యశం బెట్లుబోవును. దుర్యశంబునందుచు జీవించుటకన్న మరణించుటయే మేలు.

మ. అకటా ! యేమియొనర్చువాఁడ నిపుడా♦హా దుష్ట దైత్యేశ్వరుం
డాకయోఁడాది తదీయపట్టణమునందుం♦చెంగదా నాఁడు జా
నకి నాయెంగిలికూఁటి కాసపడె న♦న్నా రాముడంచుఙ్ జనుల్
ప్రకటింపం దలయెత్తి మెల్గగలనే ♦ భావంబునం జూడఁగ౯.

తే. గీ. దుర్యశంబును నందుచు ♦ నార్యజనుల
మెప్పుగాంచక భూమిపై ♦ మేటిసౌఖ్య
మందుచుంటుటకంటెను ♦ నఖిలసంప
దలను వీడి చచ్చుటమేలు ♦ దలఁపమదిని.

ఇప్పుడు నేనేమిసేయుదును. ఎట్లీయపవాద బాపికొందును. ఇట్టియపవాద నంది యింకను దలయెత్తి చరింపఁగలనా ! ఇందుకుఁ దగిన ప్రతీకారం బాచరించి యపవాద బాపుకొనవలయును. కానిమ్ము నాతమ్ములతోఁగూడ విచారించెద.

భద్రు—(తనలో) ఈయన మొగం బిట్టే విన్నబోయినది. ఈమాట చెప్పినంతనే దీర్ఘచింతాపరుఁడైనాఁడు. అక్కటా ! ఇంక నీతఁడేమి చేయునోకదా !

రాము—భద్రా ! నీవుపోయి తక్షణంబు నాతమ్ములను దోడ్కొని రమ్ము.

భద్రు—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

[లక్ష్మణ భరతశత్రుఘ్నులు ప్రవేశించుచున్నారు.]

భర——(రామునిజూచి) లక్ష్మణా! అన్నగారు నేఁడేమియో దీర్ఘవిచారపరులై యున్నట్లు గాన్పించుచున్నారు.

లక్ష్మ——(పరికించిచూచి) అవును నీవుచెప్పిన మాట నిజమే. ఈతని వదనమొగంబు నేఁడేమియోకాని విన్నబోయి యున్నది.

శత్రు——ఇందుల కేమికారణంబై యుండునోకదా.

లక్ష్మ——అన్నగారి సముఖమునకు వచ్చితిమికదా! అంతయు సవిస్తరంబుగఁ దెలియునుగదా! ఇంతలో మనము తొందరజెందనేల.

(అందఱును రాముని సమీపించి నమస్కరింపుచున్నారు.)

రాము——తమ్ములారా! వచ్చితిరా! ఇటఁ గూర్చుండుఁడు.

[లక్ష్మణ భరతశత్రుఘ్నులు తమతమ యాసనంబులఁ గూర్చుండురు.]

భర——(రాముని విలోకించి) అన్నయ్యా!

తే॥ గీ॥ పూర్ణచంద్రునిబోలు నీ ♦ మోము నేఁడు
వాడియుండెను నేలకో ♦ వేఁడియెండ
యందువైచిన లేతామ ♦ రాకువగిది
కారణంబేమి చెప్పుమీ ♦ కరుణమీర.

లక్ష్మ——సోదరాగ్రణీ!

చ॥ జనకునియాజ్ఞపైన వన ♦ సంతతికేగెడి వేళయందునన్
జనకధరాధి నాథసుత ♦ సాధ్విని గోల్పడినప్పుడైననున్
మనమునఁ జింతనొందవు; ఘ♦నంబుగ నేఁడదియేమొకాని, నీ
మనమునఁ జింతగల్గెనని ♦ మానసమందుఁ దలంతుఁ జెప్పుమీ.

అన్నయ్యా! ఎన్నఁడును జింతనెఱుంగని వాఁడవు. నేఁడేమికారణంబో

కాని నీమనం బతిచింతాకాంతమై యున్నట్లు గాన్పించుచున్నది. కారణంబును మాయందుఁ గరుణఁబూని వచింపుము.

శత్రు—సోదరాగ్రణీ! ప్రతిదినంబును నున్న వికాసంబు నీమొగంబున నేఁడు లేదు. నేఁడదోతీరుగ నున్నది. ఇందులకుఁ గారణంబు నీసోదరులు వినఁదగునా? రేని సెలవీయఁగోరెద.

రాము—తమ్ములారా! ఏమిచెప్పుదును!

తే॥ గీ॥ రాజ్య మేలుచునుండి దుర్యశమునంది
మనుటకంటెను ఘోరకా ♦ ననములందు
కందమూలముల్ దినుచు నా ♦ నందమంద
నుండుటది మంచిదాచును ♦ నొప్పఁగాదె.

భర—అన్నా! నీవుచెప్పినమాట నిజమేకాని మనకట్టి దుర్యశంబేమి ప్రాప్తించినది.

రాము—తమ్ములారా! ఏమిచెప్పుదును. నాకు సంభవించినది దుర్యశంబుకన్నను నెక్కువదే.

మ॥ రవివంశంబున రాజులెల్ల బోగడన్ ♦ రాజిల్లగాఁబుట్టి శ్రీ
శివచాపంబును వంచి యాజనకజన్ ♦ సీతాసతిన్ వేడ్కతో
డ వివాహంబును నాడి నాఁడటు మహా ♦ రణ్యాప్రదేశంబునం
దు వసింపఁగను రేగి క్రూరుసురున్ ♦ దున్మాడి, యున్నట్టినే
నవనిన్ నేఁడపవాద నొందితని నా ♦ యాత్మ న్విచారించెదన్.

భర—అన్నయ్యా! సకలభూమండలంబునందుఁ గలిగిన రాజులెల్ల భక్తిమీర సేవింప, సత్యవ్రతాచార పారీణుఁడవై ధర్మంబుదప్పక ప్రజల బిడ్డలభాతి నేలుచు, నిలాతలంబును బరిపాలింపుచున్న నీవేమి యపవాద నొందుటేమి!

లక్ష్మ—అట్టిది నీకేమికలిగెను !

శత్రు—సోదరాగ్రణీ ! నిరంతరధర్మవ్రతాచారధౌరేయుఁడవగు నీపై నిందమోపసాహసించిన దుర్మార్గు లెవ్వరు !

రాము—తమ్ములారా ! ఏమిచెప్పుదును !

తే॥ గీ॥ శంకలేక రాక్షసుఁడట్లు ♦ లంకయందు
వత్సరంబుంచినట్టి య ♦ వ్వారిజాక్షి
జానకీదేవిఁ దోడ్తెచ్చి ♦ సంతసమున
నేలుచున్నాఁడు రఘువర్యుఁ ♦ డిప్పుడహహా.

భర—(కోపముతో)

మ॥ భయమింతైనను బూనకుండఁగను దు♦ర్భావంబునుం బూనుచున్
నయమున్ వీడి వచించె నెవ్వఁడతనిన్ ♦ కారుణ్యహీనున్ జడున్
నయహీనున్ గలుషాత్ముఁ ద్రుంచెద వెసన్ ♦ నవ్యాస్త్రశస్త్రాళి, సం
దియమేలా మనమందు నీకసుర భే♦దీ రాజ కంఠీరవా.

ఓరఘువాగ్రణీ ! ఆరీతిని ముందువెనుక లారయక వక్కాణించిన దుర్మార్గుని, దుశ్శీలుని నిమేషకాలంబులో యమసదనంబునకుఁ బంపివత్తును. ఎవఁడోదుర్మార్గుఁ డన్నయిప్పలుకునకా నీవు చింతింపుచుంటివి !

లక్ష్మ—(కోపముతో)

తే॥ గీ॥ సకలభూమండలంబును ♦ సత్యమెపుడు
దప్పకుండఁగఁ బాలించు ♦ ధరణిపతిని
నస్మదీయసోదరునిట్టు ♦ లనినకలుష
మతిని గృపయింతలేక దు ♦ న్మాడువాఁడ.

ఓరీ ! నీచమతీ ! న్యాయాన్యాయ విచారణశూన్యా !

మ॥ జనహింసాపరులైన రాక్షసులనుఖ్ ♦ జక్కాడి యొక్కుమ్మడిన్
మునులున్ దేవతలున్ గడున్ముదమునుం ♦ బొందంగఁగావించె నా
మనువంశోత్తము రాఘవేంద్రునిటులన్ ♦ బల్కంగ నోరాడెనే
జనులెల్లన్ ముదమందఁ గూల్చెదనినున్ ♦ శాతాసిచే దుర్మతీ.

ఆ దురాత్మా! లక్ష్మణక్రోధాగ్నిఁ బ్రజ్వరిల్లఁజేసితివికదరా! ఇంక నీవెం
తకాలము ధరణిపై బ్రిదుకగలవు! కానిమ్ము నీయాయుష్కాలం
బు సమీపించినది.

శత్రు—

మ॥ మదినిసుమంతయైన నను ♦ మానముబూనక; భీతిలేక, దు
ర్మదమునుబూని యెవ్వఁడిటు ♦ రాముని యాడఁగఁగల్గె నట్టి దు
ర్మదుని మదీయశత్రునిక ♦ రంబున నేలను గూల్చువాఁడ నో
సదమలసద్గుణాకర వి ♦ చారము వీడుము రాఘవాగ్రణీ.

తే॥ గీ॥ సాధ్వియైనట్టిసీతపై ♦ సాహసమున
నిందమోపెను నెవ్వఁడా ♦ పందనిపుడు
జంపకుండనువిడుతునే ♦ శౌర్యముననను
సందియంబేల నీకింక ♦ డెందమందు.

నిఖిల జనస్తవ్యచరిత్ర, సకల సద్గుణపూత, లోకమాత యగు సీతామ
హాదేవి నెవఁడారీతి పల్కసాహసించెనో యట్టి దుర్మదాంధుని
నాఖరాసికి బలియిచ్చువఱకును నాకు నిద్రపట్టదు.

రాము—తమ్ములారా! మీకోప మెవ్వరిపైనఁ జూపెదరు!

తే॥ గీ॥ నోట మాటరాకుండఁగ ♦ నోరుమూసి
కొనఁగవచ్చునుగాని యీ ♦ కుతలమందు
లోకమును మూయగాఁదగు ♦ మూకుడున్న
దే! వచింపుఁడీ మీరలు ♦ ధీరులార.

కావున మీరు శాంతించి నాపలుకులు వినుఁడు.

భర—లక్ష్మణా! అన్నగారి పలుకులేమో విందము.

రాము—తమ్ములారా! రావణునిచేఁ గొనిపోఁబడి యొక్కసంవత్సరము లంకయందుంచఁబడిన సీతను మరల మనరా జేలుకొనుచున్నాఁడని ప్రజలు చెప్పుకొనుచుండిరి. అనుజులారా! వేయేల! దుర్యశంబునంది జీవించుట మిగులఁ గష్టము. కావున నేనిప్పు డెట్లయినను సీతను బరిత్యజించి నాయశంబును గాపాడికొనవలయును.

ఉ॥ కాన మదాజ్ఞపైన నిఁకఁ ♦ గాంతను సీతను శంకఁబూనకే
కానన భూమిలోవిడిచి ♦ గ్రక్కున రమ్ము మదీయకీర్తి భూ
జానులయందు నిల్చువటు ♦ జక్కఁగఁ జేయఁగ నీకె చెల్లెడిన్
మానుము సందియంబు నవ♦మానము నొందకు కైకనందనా!

భరతా! నీవేమియు సందియంబందకు. సీతను బరిత్యజింపఁ దలంచితిని. నీవు నామాట కెదురుచెప్పక తక్షణంబ జానకిని ఘోరారణ్యంబున విడిచిపెట్టిరమ్ము.

భర—సోదరా! నీయాజ్ఞ నెప్పుడును దాఁటువాఁడనుగాను.

మ॥ భవదాజ్ఞన్ శిరమందుదాల్చి కడు ద♦ర్పంబున్ దగం బేర్చి, వా
ర్ధవుతోఁ బోరెద; సప్తవార్ధులను జే♦తన్ దాల్చెదన్ గొండలన్
భవుకప్రీతిని బిండిజేసెదను నో ♦ భవ్యాత్మ యబ్జాభమిపు
త్రి విడంజాలను ఘోరకాననములో ♦ ధీవర్య వేయేటికిన్.

రామా! నీమాట కెప్పుడును నెదురుచెప్పలేదు. నీ వేకార్యముసేయుమన్నను సేయుటకు నీపాదసేవకుండగు నీభరతుండు సంసిద్ధుఁడయ్యే యుండును, కాని లోకమాతయగు సీతామహాదేవిని నట్టడవిని మాత్రము విడిచిరాఁజాలను. అన్నా! నాచెప్పుపల్కులు సావధానుండవై యాలింపుము. ఎవరో తుచ్ఛులనుకొన్న మాటలును

బాటించి గర్భిణియై యున్న మావదినెను గానసంబులకుఁ బంపుట యుచితంబుగాదు. ఆలోచించి యించుకచూచినచో సమస్తంబును నీకే గోచరముకాగలదు. నీకు నేను జెప్పునంతటివాఁడను గాను. అన్నయ్యా ! అమ్మహాదేవిని నరణ్యంబున డించివచ్చుట కేనంత పాతకుండనా !.

చ॥ ధరణితలంబు నెల్లగొని ♦ ధర్మపథంబును వీడి దుష్టయా
భరతునితల్లి కైక రఘు♦వర్యుని కాననభూమికంపె నం
చరయఁగ నెల్లభూజనము ♦ లాడెడి నిందయుఁ జాలదే కటా
ధరణిజ నట్లుబంపినను ♦ ధారుణిపైఁ దల యెత్తగల్గుదే.

అన్నయ్యా ! మును నేనందిననింద చాలదా ! లోకులు నన్నుఁగూర్చి పరిపరివిధంబులఁ బల్కిరికదా. ఇప్పుడు నేను సీతామహాదేవిని నరణ్యంబులయందు డించివచ్చితినేని నాబ్రదుకుంగూర్చి చెప్పవలెనా !

తే॥ గీ॥ వీడఁజాలను వనిలోన ♦ వెలఁది నిప్పు
డాజ్ఞ మీఱితినందుకు నైఁపు ♦ మయ్య నన్ను
నవనిపుత్రిని వీడు ట♦న్యాయమయ్య
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర.

రాము——(తనలో) ఎన్నఁడును నాయాజ్ఞమీఱి మెఱుంగని భరతుండిప్పుడు మీఱుచున్నాఁడు. అవును. ఇట్టికార్యమును జేసివచ్చుట యెవ్వరికైనను గష్టముగనే యుండునుగదా కానిమ్ము. శత్రుఘ్నుని గూడ నడిగిచూచెద. (శత్రుఘ్నుని విలోకించి) తమ్ముఁడా ! శత్రుఘ్నా !

తే॥ గీ॥ అవనిపుత్రిని నీ వర ♦ ణ్యంబులందు
డించివచ్చి నాయశంబును ♦ నంచితముగ
నిల్పుమీ ! నమ్మియుందును ♦ నిన్ను మదిని
నాజ్ఞమీఱనివాఁడ వీ ♦ వౌట చేత.

శత్రు—

చం॥ జనకధరాధి నాథసుత ♦ సాధుజనస్తుత సచ్చరిత్ర ; స
ద్గుణములప్రోవు ; సాధ్వమణి ♦ తోయజపత్రవిశాలనేత్రినుఁ
వనములడించి రమ్మనుచుఁ ♦ బల్కఁగఁజెల్లునె యేమినేరముఁ
వనితయొనర్చియుండె నిఁక ♦ భావములోఁ దలపోసి చూడుమీ.

సీ॥ చిన్నారిపొన్నారి ♦ చిఱుతప్రాయమునాఁడు
గాధేయుయాగంబు ♦ గాచినావు
శాపకతమునఁ బా ♦ షాణమైయున్నట్టి
వనితశాపంబును ♦ బాపినావు
శ్రీకంఠుచాపంబు ♦ జెచ్చెఱఖండించి
యవనిజను వివాహ ♦ మాడినావు
తండ్రిసత్యముగావ ♦ తన్వితోవనమందు
నంచితంబుగ వసి ♦ యించినావు

తే॥ గీ॥ లోకకంటకు రావణుఁ ♦ బ్రాకటముగ
సమర రంగంబునందునఁ ♦ జంపినావు
మునుల సంతోషవార్ధిలో ♦ ముంచినావు
కలఁడె నినుబోలు పురుషుండు ♦ క్ష్మాతలమున.

రామభద్రా !

తే॥ గీ॥ కారణం బేమిలేకనే ♦ కాననముల
సీతడించి రమ్మంచును ♦ జెప్పుటకును
జిత్తమెట్లొప్పె నీకు సు ♦ శ్రీగుణాఢ్య
చెప్ప సాహసించితినిప్పు ♦ డొప్పమీర.

సోదరాగ్రణీ! ఎవఁడో తుచ్ఛుఁడును, నీచకులజుండును, జ్ఞాన

శూన్యుండును నవివేకుండును పలికినపలుకులను బాటించి సాధ్వీశిరోమణి ని నకారణంబుగ నరణ్యంబులకుఁ బంపుట పాటిగాదని చెప్పసాహసించినందులకు నన్ను మన్నింపుఁడు. అట్టి మహాపతివ్రతాతిలకంబును నరణ్యాంబులయందు డించివచ్చుటకు నామనంబు సమ్మతించునా! అన్నయ్యా! అంత కఠినకార్యమును నేఁజేయఁజాలను. ఎన్నఁడును నీయాజ్ఞను మీరినవాఁడను గాకపోయినను, నిప్పుడీరీతిఁ జేసినందులకు క్షమింపుము.

రాము—(తనలో) అన్నా! భరతుం డట్లుచెప్పెను. ఇతండును నట్లేచెప్పుచున్నాఁడు. ఇంక నేమిసేయుదును! ఇక్కార్యం బెట్లయినను లక్ష్మణునివలననే చక్కఁబడవలెను. లక్ష్మణుం డెప్పుడును నాయాజ్ఞను మీరువాఁడుకాఁడు. ఇతఁడే యిక్కార్యంబు చేయునని నాయంతరాత్మ బోధింపుచున్నది. (ప్రకాశముగా లక్ష్మణునిజూచి) లక్ష్మణా; సదాజ్ఞావిధేయా! నీవెప్పుడును నాయాజ్ఞను మీరినవాఁడవుకావు. నాతోఁ గష్టసుఖంబులనందుచు మహారణ్యంబులయందుఁ బదునాల్గువత్సరంబులును నన్ను భక్తిమై సేవింపుచుఁ గాలంబుగడపితివి. నాసౌఖ్యమే నీసౌఖ్యముగ భావించితివి. నేనే దైవంబుగ భావించితివి. నన్నుమించిన దీజగంబునలేదని తలంచితివి. ఇప్పుడుగూడ నాయాజ్ఞను మన్నించాల్చి జనకజను ఘోరారణ్యంబునందు డించి వచ్చి నాయశంబును గాపాడుము. ఇందుకునీవు మారువలుకకుము.

లక్ష్మ—(తనలో) ఈయనఘుని యాజ్ఞను నేనెప్పుడును దాఁటినవాఁడనుగాను. ఇప్పుడేమిసేయుదును. ఈయనయాజ్ఞను నేను నిరాకరించితినేని గురులయానతి మీఱినవాఁడ నగుదును. అదియునుంగాక నిమ్మహాత్మున కాగ్రహంబు రాకమానదు. ఏమిచెప్పుటకును దోఁచకున్నది. అయినను నిమ్మహానుభావున కిట్లు చెప్పచూచెదను. (ప్రకాశముగా) సోదరవత్సలా! రాఘవేంద్రా!

శా॥ ఏకాంతామణికై శరాసనము నీ ♦ వెంతేనియున్ వంచితో
ఏకాంతమణికై విరాధు వనిలో ♦ నీధారుణిం గూల్చితో
ఏకాంతమణికై ; బ్రభాకరజు నీ ♦ వెంతేనియుం జేర్చితో
యాకాంతామణి నిష్ఠు ఘోరవని నా ♦ హా పీడఁగాఁ జెల్లునే॥

శా॥ ఏకంజాక్షి నిమిత్త మిందిరసుతు నీ ♦ వీభూమిపైఁ గూల్చితోఁ
ఏకంజాక్షికినై మహాంబుధిని నీ ♦ విట్లింతలోఁ దాఁటితో
ఏకంజాక్షికినై దశాస్యుననిలో ♦ నింపారఁగాఁ జంపితో
యాకంజాక్షిని సీతఁ బాయఁదగునే ♦ యాహా రఘుగ్రామణీ.

ఆనాఁడు లంకయం దామెపాతివ్రత్యంబును బరీక్షసేయఁదలంపఁగా నామె యగ్నింబడఁగా, నప్పు డగ్నిదేవుఁ డీమె మహాపతివ్రతా శిరోమ ణియని చెప్పి నీకప్పగించుట మఱచిపోతివా ! అన్నయ్యా ! మిమ్మొ క్క త్రుటికాలంబైనను నెడబాయక, మీవెంట వనంబులకేతెంచి, మీరే దైవంబుగభావించి, మీతోఁగూడఁ గష్టసుఖంబులనందుచు సాధ్వీశిరోమణియనఁ బేరందిన సీతామహాదేవి నిప్పుడు మరల నర ణ్యంబులయందు డించిరమ్మనిచెప్పుట సమస్తంబును దెలిసిన మీకుఁ దగునా ! అన్నయ్యా ! సమస్త ధర్మాధర్మంబులును దెలిసిననీకు నేను జెప్పఁ గలవాఁడనుగాను. కాని సీతమ్మయందనగుటచేఁ జెప్పుటకు సా హసం బూనితిని. అందుకునన్ను మన్నింపుము.

శా॥ సీతోఁ గష్టసుఖంబులందుచును ని♦న్నే దైవముంగా సదా
చేతోవీధిఁ దలంచి నిష్టమెయి సు ♦ శ్రీమీరగా నీపదా
బ్జాతంబుల్ దగఁగొల్చుచుండెడి మహా♦సాధ్వీశిరోరత్నము న్
శీతాంశుప్రతిమానబింబవదనన్ ♦ సీతాసతిన్ వీడుదే.

రాము—(స్వగతము) వీరుముగ్గురును నిట్లేచెప్పిరి. ఇప్పుడు నేనేమిసే యుదును. సీతనునెడబాయకున్నచో నాకు దుర్యశంబు సంభవించు ౬

నిజంబు. కానిమ్ము. మరలవీరినే యడిగిచూచెదఁగాక. (ప్రకాశము
గా) తమ్ములారా! మీరెవ్వరును సీతను నరణ్యంబులయందు డించి
వచ్చుటకు సమ్మతింపరా మీయగ్రజునకు దుర్యశంబువాటిల్లుట
మీకిష్టమా! ఇదియేనా మీకు నాయందుఁగలిగినభక్తి. మీనక్కవి
నయంబులన్నియు నేఁటితోఁదెలిసినవి.

భర—అగ్రజా! నీయాజ్ఞ నెప్పుడును దాఁటువారముకాము. నీయందు
భక్తిఁబూని చరింపనివారముకాము. కాని యెవఁడో పామరుండాడిన
పలుకులనుబాటించి పూతచరిత్రయగుసీతామహాదేవి నకారణంబుగ
నరణ్యంబులయందు డించిరమ్మని చెప్ప నేనేమనఁగలవాఁడను. సోద
రాగ్రణి! నాయందుఁ గృపవహించి, యించుకశాంతించి, యాలో
చించిచూడుఁడు. అంతియెకాని యిట్టికార్యము సేయబోకుఁడని ప్రా
ర్థింపుచున్నాను.

శత్రు—నేరమేమియు నెఱుంగనిమాతల్లిని సీతామహాదేవిని విడనాడుట
నిరంతరధర్మ వ్రతాచారపారీణుండవగు మీకుఁ దగదనిచెప్పవలసి
వచ్చినందుకు నన్ను క్షమింపుఁడు.

లక్ష్మ—అన్నయ్యా!

మ॥ పదునాల్గేడులు ఘోరమైనవనిలో ♦ వాసంబునుం సల్పఁగా
ముదమొప్పారఁగవచ్చి నీకెపుడు సం♦పూర్ణంబుగా భక్తితో
మదిరంజిల్లఁగ సేవజేయుజనక ♦ క్ష్మాధీశపుత్రీమణీ
సదయాత్మా వనిలోనవీడఁదగునే ♦ శాంతిం దగంబూనుమీ॥

అన్నయ్యా! నాప్రార్థనమాలకింపుము. నీయాజ్ఞను నెన్నఁడును మీఱిన
వాఁడనుగాను. సీతామహాదేవి నట్లు వీడనెంచకుఁడు.

రామ—తమ్ములారా! మీకుఁదెలిసినంతమాత్రపునీతులు నాకును దె
లియును. నాయాజ్ఞపై సీతను గాననంబునడించిరమ్మని చెప్పితిని

గాని యనవసరంబగునిట్టి యుపన్యాసంబుల నీయుమని పలుకలేదు. నీచకులజుండాడినవాక్యమును బాటించి సీతను గాననంబులయందు డించివచ్చుటతగదనియా మీరుచెప్పుచుంటిరి. ఇట్టివాక్యం బెప్పుడు ను నీచునినోటినుండియే వెలువడునుగాని యార్యులనోటినుండి వె లువడదు. సత్యాసత్యంబులు నీచునినోటనుండియే యరయవచ్చు ను. నేనెట్లయినను సీతనువిడనాడి నాయశంబును గాపాడుకొనవల యును. మీరెవ్వరును నాయాజ్ఞనుదీర్పఁదలంచనప్పుడు నేను దాని కిఁ దగినకర్తవ్యము నేదియో చూచుకొనవలయునుగదా! కావున మీరందఱును నిచ్చటసుఖంబుగ నుండుఁడు. నేను నాదారింజూచు కొనెద. (అని వెళ్ళఁబోవుచున్నాఁడు)

లక్ష్మ—(రామునిబట్టుకొని) అగ్రజా! ఎక్కడికేగుదురు.

రాము—తమ్ముఁడా! ఎక్కడికైనను నాసంగతిమీకేల ?

లక్ష్మ—అన్నయ్యా! నీవట్లుపలుకుట న్యాయమా!

రాము—తమ్ములారా!

తే॥ గీ॥ మీరు నామాట వినకున్న ♦ వారు దుర్య
శంబుబ్రాప్తించుచుండె రా♦జ్యంబదేల
యశమునిల్పుకొనఁగనెంచి ♦ యరుగువాఁడ
ఘోరకాననభూమికిఁ ♦ గోర్కెతోడ.

తమ్ములారా! మీరు నాయాజ్ఞను నెరవేర్పఁదలంపరైరికదా. మీరు నామాట విననప్పుడీరాజ్యంబుమాత్రము నేల! యశంబడుగంటను న్న యప్పుడీరాజ్యంబును, భోగంబును సౌఖ్యంబును నేల! సకలసం పదలనురోసి నేనే వనభూమికిఁబోయి వసించెదను. మీరు సుఖంబుగ రాజ్యంబు బాలించుకొనుఁడు. నేనిట్లుజేసితినేని మీరు నామాట విననవసరముండదు. సీతను వనంబులయందు డించి రానక్కరలేదు.

లక్ష్మ—

తే॥ తారె పురివీఁకి యీరీతిఁ ♦ దరలుచుండ
నుండనొతురె కతమ్ము ♦ లుర్వీశేఁడ
నీపదంబులఁ గొల్చుచు ♦ నిన్నుఁగూడి
యరుగుదెంతుము మముగూడి ♦ యరుగుమయ్య.

భర—అన్నయ్యా! మీరే యీపురివీఁకి యిట్లరుగుచుండ, మేనుమా త్రిము రాజ్యసుఖంబులనందుచు నిచ్చట నుండనెంతుమా! మీ చరణపద్మంబులసేవింపుచు మేము వచ్చెదము.

శత్రు—అన్నయ్యా! నీపెట్టికార్యము జేయనెంచితివి! నీయందు భక్తి తాత్పర్యములనుబూని చరింపుచున్న మమ్ము విడనాడి యేగుట మీ కేరిన్యాయము. మీరెక్కడనుండిన మేమును నక్కడనే యుండువా రముకాని మిమ్ము విడనాడియుండువారము కాము.

రాము—చాలుఁజాలు. మీకునాయందున్నభక్తి తెలిసినది. మీకు నా యందుభక్తిగలవారేని నాయాజ్ఞనుమెఱవేర్చియే యుందురు. నేనైనను బురంబువీడి కాననభూమికిఁబోవలయును. లేదా సీతనైనను నెడఁబాయనలయును. ఈరెంటియందును నేదేని సలుపకున్న దుర్యశంబు సంభవించును. (లక్ష్మణునిజూచి) లక్ష్మణా! నీకునాయం దున్నభక్తి తాత్పర్యములఁగూర్చి సంపూర్ణంబుగఁ దెలియును. మీ వదినెయందుండుప్రేమచే నీనట్లువక్కాణింపుచుంటివి. కాలముత ప్పివచ్చినప్పు డెట్టిప్రేమనైనను త్యజింపవలయును. నీవునాయందు సంపూర్ణమైనభక్తినిబూని చరింపుచుండువాఁడవు కాన నిన్నే యి క్కార్యంబునకు నియోగించుచుంటి. తమ్ముఁడా! నీవేమియుసందియంబునునందక సీత నిప్పుడే కాననంబున డించివచ్చి నాయశంబును గాపాడుము. ఇందుకునీవు మారుపలుకకుము పొమ్ము.

లక్ష్మ—(తనలో) ఆహా! ఈయనఘునియాజ్ఞ నిప్పుడు నెఱవేర్చి తీరవల యును. ఇఁకనాకు సీతను నరణ్యంబులయందు విడిచి రాక తప్పదు. అక్కటా! జనకరాజతనూభవ కిట్టియవస్థ ప్రాప్తించవలసినదేనా! (సీతందలంచి) హా! జనకరాజతనూభవా! నీవు పుట్టిననాఁటనుండి యుఁ గష్టంబులనే యందుచుంటివి! తల్లీ! పుట్టినయింట నేమిసౌ ఖ్యంబునందితివో కాని మెట్టినయింటమాత్రము నేమియు నెఱుం గవుకదా. అయ్యో! ధరాతనయా! నీబ్రదుకంతయు నడవుల పా లేయగుచుండెనుగదా. తల్లీ! నిన్నుఁదలంచుకొనిన నాకు శోకంబు బొంగి పొంగి వచ్చుచున్నది. (ఇంచుక యూరకుండి) హా! దుర్మ తీ! లక్ష్మణా! అన్నను నెడబాయలేక వనంబుల కాతనితో నరిగి ప దునాల్గువత్సరంబులును నతిభక్తితో సేవించిన నీవే యిప్పుడు సీతా దేవిని కాననంబులయందు డించివచ్చుటకు సమ్మతించుచుంటివా! ఎట్టికట్టడికార్యమును జేయనెంచితివి. అయ్యో! నేనీరీతి జింతించెద నేల. అగ్రజునియాజ్ఞ యనుల్లంఘ్యనీయముకదా! అప్పుడు నేను లోకకంటకుఁడైన యింద్రజిత్తుతోఁ గయ్యంబొనర్చి చావకయుండు ట సీతను నరణ్యాంబులయందు డించివచ్చుటకే కాఁబోలు. కానిమ్ము. ఇంకనేను విచారింపనేల! శ్రీరాముఁడాజ్ఞయొసంగినట్లు జానాకీదేవిని నరణ్యాంబులయందు డించి వచ్చెదఁగాక.

రాము—(లక్ష్మణుని జూచి)

తే॥ గీ॥ నిందుచూలాలి నిప్పుడు ♦ "నేనరణ్యా
మందు నేరీతి విడుతునా" ♦ యంచు మదిని
సందియంబును నీవింక ♦ నందవలదు
మునిసువాసినులను జూడ ♦ ముగుద కోరె
నానెపంబునఁ బోవచ్చు ♦ నయ్య యనుజ.

వాల్మీకాశ్రమప్రాంతభూములను, నచ్చటనుండు మునికన్యలను దర్శింప మిగుల( గుతూహలంబగుచున్నదని నన్నెన్నియో సారులు నీవదినె యడిగెను. నీవిప్పుడానెపంబున నామెను దోడ్కొనిపోవచ్చును. సందియంబందక పోయిరమ్ము.

లక్ష్మ—ఇదే భవదాజ్ఞ మాళిందాల్చి నెరవేర్చుచున్నాఁడ.

రాము—తమ్ములారా! ఇంకమనము గృహంబున కేగుదము రండు.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రథమాంకము.







# శ్రీ రామాశ్వమేధము.

## ద్వితీయాంకము.

స్థలము, అరణ్యము, ప్రవేశము:—సీత, లక్ష్మణుఁడు.

సీత—(తనలో) ఆహా! ఏమిది! నామనంబున నెన్నఁడును గలుగని విచారము జనించుచున్నదే. రథమ్ముపైఁ గాలునెట్టినదాదిగఁ జిత్తంబంతయుఁ గలతజెందియున్నది. లక్ష్మణా! ఏమిది! మనము బయలుదేరినప్పటినుండియు నపశకునంబులే యగుచున్నవి. లెక్కకొక్క శుభశకునం బైనను గానరాకున్నది. అక్కటా! ఇందులకేమి కారణం బై యుండునోకదా! ఈయపశకునంబు లేమియు మనవారికిఁగాని మనరాష్ట్రజనులకుఁగాని యేకీడును బొందజేయక యుండుఁగాక.

లక్ష్మ—(తనలో)

తే॥ గీ॥ నాథుఁ డీరీతి నిన్ను గాననములందు
డించి రమ్మంచు నాకు వచించె నంచు
నీమెతోడ నెట్టులు వచియించువాఁడ
నక్కటా తోఁచదయ్యెను నాత్మయందు.

ఈమెనాథునియాజ్ఞ నీమెకుఁ దెలిపినచో నెట్లుచింతించునోకదా. ఎట్లుచెప్పఁగలను! ఓయీ! లక్ష్మణా! కఠినచిత్తుండవై నిండుచూలాలిని నరణ్యాంతరంబులయందు డించిపోవ సాహసించి వచ్చిననీ వీమాటఁ జెప్పుట

కు సాదియంబాదుచుంటివా! (ప్రకాశముగా) తల్లీ! ఈయుపశకు
నంబులఁగూర్చి నీవేమియు విచారింపకుము.

సీత—అవును! నీవుచెప్పినట్లు నేను విచారింపనేల! అయినను మనమి
ప్పుడే సత్వరంబుగ మునికన్యలం దర్శించి పురంబునకు మరలుదము.
అదియునుంగాక,

తే॥ గీ॥ పోవనున్నది వాల్మీకి ♦ పుణ్యభూమి,
గాంచనున్నది తాపస ♦ కన్యకలను,
పోవుచుంటిని శ్రీరామ ♦ భూపునాజ్ఞ,
వెంటనున్నది నీ, వింక ♦ భీతియేల.

లక్ష్మ—తల్లీ! ఇదే మన మరణ్యప్రదేశము బ్రవేశించుచున్నారము.

సీత—లక్ష్మణా! ఇదియేనా! వాల్మీకాశ్రమంబునకుఁ బోవు తెరవు.

లక్ష్మ—(తనలో) అయ్యో! ఇప్పుడేమిచెప్పగలను! ఇచ్చట రెండుతెర
వులున్నవి. ఇయ్యది తిన్నగా వాల్మీకాశ్రమంబునకుఁ బోవుతెరవు.
ఇయ్యది గంగానదీతీరంబున కేగును. కావున నేనిప్పుడు గంగాతీరం
బునకే మార్గంబుదీసెద. ఈమెనచ్చట డించినచో వాల్మీకాశ్రమం
బుగూడ నచ్చట కనతిదూరంబేకదా! (ప్రకాశముగా) తల్లీ! మన
మీమార్గంబునఁ బోవుదము.

సీత—లక్ష్మణా! నామనంబునఁ గలిగినచింత యిప్పటికి వీడకుండుటయే
కాక, యంతకంత కధికంబగుచున్నది.

తే॥ గీ॥ నారచీరెలు నిచ్చి యా ♦ నాఁడు కైక
వనములందు వసింపఁగాఁ ♦ బంపునప్పు
డైన నెఱఁగియుండనిచింత ♦ యాత్మయందుఁ
గలిగె నిప్పుడు దానికిఁ ♦ గతమదేమొ.

తే॥ గీ॥ పర్ణశాలయందుండ దు ♦ ర్మదముఁబూని
యసురనాథుఁడు నన్ గొని ♦ యరుగునప్పు
డైన నెజేఁగియుండనిచింత ♦ యాత్మయందుఁ
గలిగె నిప్పుడు దానికిఁ ♦ గతమదేమొ.

ఇట్టి మనోవైకల్యంబును నెన్నఁడును బొందని యెఱుంగను.

లక్ష్మ—మహారణ్యప్రదేశంబును బ్రవేశించితిమి గాన నీకేమైన భీతి వొడముచున్నదేమో! అమ్మా! నేను నీవెంట నుండ నట్టిభీతినేమి యుఁ బొందవలదు. (తనలో) ముం దరుదెంచుసంగతిఁ దెలియఁజే యుట కివియన్నియు సూచకంబులుకదా!

సీత—సౌమిత్రీ! మనము గంగను సమీపించినాము. ఆహా! ఏమి! ఈనదినిర్మలత్వము. ఎంతనేత్రపర్వంబై యొప్పుచున్నది. ఇందు స్నా నంబాచరించిన సమస్తపాపంబులును నశించునుగదా. లక్ష్మణా! ఇయ్యదిచూడగనే నామనస్సంతాపము పోయినదిసుమా!

లక్ష్మ—(తనలో) పాపము. ఈనదింజూడఁగనే యీమెకుఁగలిగిన చిత్త సంతాపంబును మఱచి సంతసించుచున్నది కాని ముందువచ్చు సంగ తిమాత్రం బెఱుంగకయున్నది. ఇట్టి మహాసాధ్వికి శ్రీరామచంద్రు నాజ్ఞ నిప్పుడెట్లుచెప్పుదును. అక్కటా! ఎంత దురంతకార్యమును జేయ సాహసించితిని. (ఆలోచించును)

సీత—లక్ష్మణా! ఏదియో యాలోచింపుచుంటివి. ఈమహానదిం జూచి సంతసింపక ఖిన్నవదనుండవై తివేమి!

తే॥ గీ॥ పూర్వమందున్న సత్కళ ♦ మోమునందుఁ
గానుపింపకయుండెను ♦ కతమదేమి
వాఁడియుండెను నిశియందుఁ ♦ బద్మమట్టు
లింటిపై భ్రాంతిజనియించె ♦ నేమొ మఱఁది.

నీవదనాబ్జ మేకారణంబుచేతనోకాని చిన్నవో యినట్లున్నది. మనము బ యలుదేరునప్పుడున్న సంతసంబు నీమొగంబునఁ గానరాకున్నది.

లక్ష్మ—(తనలో) హాదైవమా! ఇప్పుడీమె కేమిచెప్పుదును. (ప్రకాశ ముగా) అమ్మా! ఎండలో వచ్చుటంజేసి యట్లున్నదేమోకాని మ రేమియుఁ గారణములేదు. (అని రథము నడిపించుచున్నాఁడు)

సీత—సౌమిత్రీ! మునిజనాశ్రమంబు లెచ్చటను గాన్పింపకున్నవే. కడు దూరంబరుదెంచితిమి. ఈసమీపంబునఁ దాపసాశ్రమము లుండెనేని మునికుమారు లెవ్వరును సుమంబులుగోయుట కీప్రాంతంబులకు రారేమి! మఱిఁదీ! ఒకవేళ మనము మార్గము తప్పితిమేమో! ఇది యంతయు భీకర శార్దూల మృగోరంబుల కాంరంబైన ఘోరారణ్యా మువలె నున్నదే.

లక్ష—(కన్నుల నీరు గార్చుచున్నాఁడు)

సీత—లక్ష్మణా! ఏమిట్లు తలవాల్చి మిగులఁ జింతింపుచుంటివి. కన్నుల నీరు కాలువలుగట్ట నేడ్చుచుంటివేల!

లక్ష్మ—(ఏడ్చుచు) తల్లీ!

కం॥ పరిచారికా జనంబులు
చిరభక్తిని గొలువనెపుడుఁ ♦ జెలఁగెడి నిన్ భీ
కరకాననములకును నీ
కరణిం జేర్చితినిగాదె ♦ కఠినాత్ముఁడనై.



సీత—తే॥ గీ॥ మునిసతులఁ జూడఁగోరిక ♦ జనవమయ్యె
నంచుఁ బ్రార్థించి చెప్ప మీ ♦ యన్న బంపె
నన్ను; నీతోడునిచ్చి; మ ♦ నంబునందు
నిట్లు పరితాపమొందెద ♦ వేలమఱఁది.

సుమిత్రాకుమారా! మునిసువాసినులు దర్శించివచ్చెదనని మీయన్నగారి యాజ్ఞపైనేకదా వచ్చితి. అట్టియెడ నీవకారణంబుగ "నేనే యీకాననభూమికి నిన్నుజేర్చితి" నని చింతించెదవేల! ఒకవేళ మీయన్నగారియాజ్ఞను బొందకుండ నన్ను దోడ్కొని రాలేదు గదా!

లక్ష్మ—అమ్మా! అట్లెన్నటికిని దలంపకుము.

సీత—అట్లయినచో,

తే॥ గీ॥ నారచీరెలనిచ్చి వనంబు లందు
మునల, వసియింపఁ గైకమ్మ ♦ బంపునప్పు
డైనఁ జింతించియెఱుఁగవే ♦ యకట యిపుడు
కనుల నీరుగార్చెద వేమి ♦ కారణంబు.

ధర్మవిరుద్ధంబైన కార్యంబేమియుఁ జేయలేదుకదా! శరణన్నవారిని వీడలేదుకదా, పరధనంబున కాసపడవుకదా, పరకాంతలంగవయ నెంచవుకదా, గురుల యానతి మీఱవుకదా! మఱేదీ! ఎన్నఁడును విచారమెఱుంగని నీవి ట్లెలవిలపించెదవు!

లక్ష్మ—అమ్మా! ఏమిచెప్పుదును. నిండుచూలాలివగు నిన్ను మహారణ్యప్రదేశంబున డించి పోవలసివచ్చినందులకుఁ జింతించుచుంటి.

సీత—లక్ష్మణా! నన్నుడించి పోవుటయేమి! ఇప్పుడే మనము తీసికొని వచ్చిన పవిత్రవస్తువులవస్తునివహంబు మునిసువాసినుల కిచ్చి నేనును నీవెంట నిప్పుడే కదురయంబున నరుదెంతునుగదా!

లక్ష్మ—(తనలో) ఈమెనావాక్యంబున నర్థంబును గ్రహించలేదుకదా, పిట్టపిడుగుంబోలిన నాథునియాజ్ఞను నీమెకుఁ దెలుపకే నాకుఁదప్పదు. తెలిసినంతనే యీమె యెంతచింతించునో యేమిచేయునో కదా! (ప్రకాశముగా) తల్లీ! చెప్పుటకు నాకు నోరాడకున్నది.

ఉ॥ కాననమందు నిన్విడిచి ♦ గ్రక్కునరమ్మని నాకు రామభూ
జాని యనుజ్ఞనిచ్చె నిఁక ♦ సత్కృపఁబూనక నిన్ను నెట్లు లీ
కాననభూమిలో విడువ♦గా నగునంచును మాటిమాటికిన్
మానసమందు నిట్టులు ఘ♦నంబగు చింతను బొందుచుంటి నేన్॥

సీత—(ఆశ్చర్యముతో) ఏమి! లక్ష్మణా! అట్లుచెప్పుచుంటివి. నానా
థుఁడు నన్నరణ్యంబున విడిచిరమ్మని నీకాజ్ఞాపించెనా! మరల నన్నుఁ
దోడ్కొనిరమ్మనిచెప్పలేదా! నీపలుకులు నాకచ్చెరువుబుట్టించుచు
న్నవే.

లక్ష్మ—తల్లీ! ఏమిచెప్పుదును. ఓమహాసాధ్వీశిరోమణీ!

సీ॥ భూసతికి సుతవై ♦ పొలుపొంద బుట్టి య
యోనిజయంచు పే ♦ రొందినావు
జనకభూపాలు హ♦స్తంబులందుఁ బెరిగి
పతితగుణాఢ్యవై ♦ పఱఁగినావు
విశదగుణాఢ్యుఁడౌ ♦ దశరథేశ్వరు కోడ
లవునౌచు మిగులఁ జె♦లంగినావు
శ్రీరామభూపాలు ♦ చిగురుబోడివియౌచు
ఘనకీర్తితోడను ♦ గ్రాలినావు

తే॥ గీ॥ వరపతివ్రతవంచును ♦ ధరణిపైన
నగ్నిహోత్రునిచేత మె♦ప్పొందినావు
నక్కటా తప్పవయ్యెను ♦ నిక్కటు లిటు
చెప్ప నోరాడకున్నది ♦ సీత! మాత.

చ॥ పరమకిరాతుఁడన్ జడుఁడఁ ♦ బాపరతుండను దుర్మదుండ భా
స్కరకులమెల్ల మన్ననను ♦ గల్పగఁబుట్టిన వాఁడ నక్కటా!

కరుణయొకింతలేక నిను ♦ గానన భూమికిఁ జేర్చినట్టి, దు
శ్చరితుని నన్ను శాపమునఁ ♦ జంపుము తల్లిరో నీకు మ్రొక్కెదన్.
(అని సీతాదేవి పాదంబులపైఁబడి యేడ్చుచున్నాఁడు)

సీత—లక్ష్మణా! ఏమివెఱ్ఱి! ఇంతచింతకుఁ గారణంబేమో చెప్పక యి
ట్లు విలపించెదవేల!

లక్ష్మ—(కన్నీరునించుచు) పరమకిరాతుఁడనై మహారణ్యంబునకు నిన్నుఁ
జేర్చిన నేను నాసంతాపంబునకుఁ గారణంబు మాత్రము చెప్పఁ
జాలనా!

శా॥ తల్లీ జానకి! సూర్యవంశమున నిం ♦ దారన్ మహాకీర్తి వ
ర్థిల్లంజేసిన భాగ్యదేవత మహా ♦ ధీరపవిత్రాపోజ్వలీ
ఫుల్లాంభోరుహ పత్రనేత్ర! విలస ♦ త్పూర్ణేందు బింబాననా
మూల్లోకంబులఁ బ్రోచుశౌరియు నినున్ ♦ బ్రోవంగ రాఁడాయెగా.
(అని యేడ్చును)

సీత—మఱఁది! నీవిట్లేడ్చినకొలఁదిని నాకును సంతాపం బధికంబగుచు
న్నది.

ఉ॥ ఎన్నఁడు గన్నునీరనఁగ ♦ నేమొ యెఱుంగవు నట్టినీ వహా
కన్నులనీరు గాలువలు ♦ గట్టగనేడ్చెద వేటికయ్య, నీ
వున్నది యున్నయట్టు లిఁక ♦ నొప్పుగఁజెప్పుము దప్పకుండ, నీ
విన్నదనంబు నా కిపుడు ♦ భీతియుఁ జింతయుఁ బుట్టె లక్ష్మణా.

లక్ష్మ—తల్లీ! చెప్పుటకు నోరాడకున్నది. ఇట్టి క్రూరకార్యం బాచరిం
చిన యీ మహాపాతకిని జచ్చునట్లు శపియింపుము. (అని కాళ్ల
పైఁబడును)

సీత—లక్ష్మణా! నీవంత మహాపాతకం బేమియొనర్చితివి. కారణంబు

మాత్రము నేనరయఁ జాలకున్నాను. మఱిఁదీ! సందియంబందకుము. నీచింత నాకేమైన సంతాపంబును గూర్చునేమో యని నీవు చెప్పటకు సందియంబందకుము.

లక్ష్మ—(తనలో) ఈయమ్మ యెట్లు పలుకుచున్నది. ఇంక నేనెంతకాలము శ్రీరామునాజ్ఞ నీమెకుఁ దెలుపక దాఁచగలను. కానిమ్ము. ఏమైననుసరే. చెప్పెదను. ఆపైనఁ బరమేశ్వరుం డీమెను రక్షించుఁ గాక. (ప్రకాశముగా) ఓమహాసాధ్వీశిరోరత్నమా! సీతామహాదేవీ!

మ॥ పదునాల్గేఁడులు ఘోరమైనవనిలో ♦ వాసంబునుంజేసి సొం
పొదవన్ వచ్చి పురంబునందున ముదం♦బొప్పారగానుంటి వం
చెదలో నెంచితిఁగాని యిట్టులకటా ♦ యీ కాననాళిన్ నిరున్
విధి; వాసంబును సేయవా్రిసె ననుచున్ ♦ వీక్షింపనైతిన్ గదా.

అమ్మా! నిన్నుఁ గాననంబున విడిచిరమ్మని శ్రీరాముం డనుజ్ఞ యిచ్చినాఁడు. ఆకారణంబున నే నిట్లుఁ జింతింపుచుంటి.

సీత—లక్ష్మణా! నన్ను మరల నీవెంటఁబెట్టుకొని రమ్మని చెప్పలేదా?

లక్ష్మ—తల్లీ! ఆభాగ్యంబును నీవుగాని నిన్ను వెంటఁబెట్టుకొనిపోవు నంతటి భాగ్యంబును నేనుగాని నోఁచికొనలేదు. అయ్యో యేమిచెప్పుదును! నీ కరణ్యావాసంబుమాత్రము తప్పదయ్యెను గదా!

సీత—హా! ఎంతపాపాత్మురాలను. (అని మూర్ఛిల్లుచున్నది)

లక్ష్మ—అక్కటా! ఎంతకష్ట మెంతకష్టము! ఈమె యీవాక్యంబును జెప్పినంతనే మూర్ఛిల్లినదే.

సీత—(మూర్ఛ లేచి) అయ్యో! లక్ష్మణా! నీవు మన్నాథునాజ్ఞ మఱచిపోయి యుంటివని నేనూహించుచున్నాను. కాకయుండినచో నానాథుండు కాననంబునవిడిచి రమ్మనుటకు నేనంత ఘోరపాపం బేమి యొనర్చితిని.

లక్ష్మ—అమ్మా! ఏమిచెప్పుదును. "లోకకంటకుఁడయిన రావణుని చేఁ గొనిపోఁబడి యొకసంవత్సరము లంకయం దుంచఁబడిన సీతను మరల దెచ్చికొని రాముండేలుచున్నాఁ" డని మనపౌరులు చెప్పుకొనుమాటలువిని దుర్యశంబు వాపుకొనుటకై వాల్మీకాశ్రమంబు జూచివచ్చు నెపంబున నిన్ను ఘోరారణ్యంబునకుఁ దోడ్కొనిపోయి విడిచిరమ్మని రాముండు నాకాజ్ఞాపించినాఁడు.

సీత—హా! (మూర్ఛిల్లును)

లక్ష్మ—అక్కటా! ఎంతదారుణము.

సీత—(మూర్ఛనుండి లేచి) లక్ష్మణా! నేనెంతపాపంబు జేసికొంటినో కదా. ఆనాఁడరణ్యంబున హేమకురంగంబు వెంటఁ బోవుచు "జానకిని నేను వచ్చువఱకును విడనాడక కడుజాగరూకతతో నరయుచుండు" మని చెప్పిన మన్నాథుండే నన్నెడఁబాయఁ దలంచి యరణ్యంబున విడిచిరమ్మని నీకాజ్ఞయిచ్చెనా! అకటా! నానాథుండు నాయెడల నెంత నిర్దయతవహించెను. నాఁడు నను గొనిపోవుటకు లంకకేతెంచి రావణునిద్రుంచి, నాపాతివ్రత్యమును బరీక్షింపఁదలంప, నే నగ్నింబడ నగ్నిదేవుఁడు ప్రసన్నుఁడై మీయన్నకు నేను సాధ్వి నని చెప్ప నతఁడు కారుణ్యాత్ముఁడై నన్ను గ్రహించెనుగదా! న్యాయాన్యాయ విచారణదక్షుండును, సత్వగుణసంపన్నుఁడును నగు మీయగ్రజుం డెవరోహీనునినోటినుండి వెలువడిన యాతుచ్ఛవాక్యంబును సాకుజేసికొని నన్నుఁ బరిత్యజించుట న్యాయమా! అరణ్యవాసంబు సల్పుతరిని మీయిరువురును నన్నుఁ గంటికి రెప్పచందమునఁ గాయలేదా? ఇప్పు డిట్లు నిందుచూలాలిని నన్నీఘోరారణ్యంబున వీడుదురా? ఇదేనా మీరాజధర్మంబులు!

లక్ష్మ—(తనలో) ఈమెవాక్యంబుల కేమి ప్రత్యుత్తరమిచ్చువాఁడను.

(ప్రకాశముగా) మాతా! సమస్తంబును దెలిసిన నీకు నేనేమి చెప్పఁగలను.

సీత——మఱఁదీ! మఱచి యిట్లంటిని. ఇందు మీయగ్రజుని నననలసిన దేమున్నది. దుర్యశంబు భరించుట యెవ్వరికైనను గష్టమేకదా. నన్నీరీతిని బరిత్యజించి మీయన్న యశంబు గాపాడుకొనదలంచెను. కానిమ్ము. ఇందుకు నేను విచారింపను. దుష్టురాలనగు నన్నుఁ బరిత్యజించి ప్రాణేశ్వరుండు తన యశశ్చంద్రికను గాపాడుకొనవలసినదే. భాస్కరాన్వయంబు వేయేండ్లకును వర్థిల్లవలసినదే, కాని, నానాథుం డిట్టిసంగతియని నాతోఁ జెప్పినచో నేనేమందును. ఆయనయాజ్ఞకు నేను వేరువిధంబుగఁ బ్రవర్తింతునా! నన్నుఁ బరిత్యజింపక దుర్యశంబును నందుమందునా! పోనిమ్ము. నానాథునకు దయలేదనుకొమ్ము. లక్ష్మణా! భక్తికలిగిన నీవైనను నా కీసంగతి దెలుపవైతివికదా! అట్లు దెలిపియుంటివేని, కన్నులఁ గరువుదీరునట్లు నాథుని ముఖారవిందంబును జూడకుందునా? ఇదియే కడసారి పాదసేవసేయుట యనుకొని, యొక్కసారి హృదయేశ్వరుని పాదాబ్జంబులకు నమస్కరింపకుందునా?

లక్ష్మ——తల్లీ! అగ్రజుని యాజ్ఞకదా!

సీత——మఱచితిని. నీ తప్పేమియులేదు. శ్రీరామచంద్రుని యాజ్ఞ చతుర్దశ భువనంబులును శిరసావహించవలసినదే కదా! లక్ష్మణా!

తే॥ గీ॥ విపినములయందుఁ దనువును ♦ వెళ్ళదీయు
మంచు నాదుముఖంబున ♦ నయ్యెజుంపు
వ్రాసియుండఁగ దాఁటంగ ♦ వశమె మనకుఁ
జింతయేటికి నాకింక ♦ స్వాంతమందు.

పురంబునందుండి నిరంతర భాగ్యభోగ్యంబుల ననుభవింపకపోతి నను

చింత నాస్వాంతంబున లేదుగాని, శ్రీరామచరణసన్నిధానంబును బాయవలసివచ్చెను గదా యని చింతింపుచుంటి. అయ్యో! నా హృదయేశ్వరుని నిఁక నే నీజన్మంబునఁ జూడనుకాఁబోలు. అయ్యో! లక్ష్మణా! పూర్వజన్మంబున నేదంపతులనెడబాపి సంతసించితినో తత్ఫలం బిప్పు డనుభవించుచుంటి. అక్కటా! నాదుఃఖాంబంతంబు లేనిదియయ్యెనే.

లక్ష్మ — తే॥ గీ॥ నిందు చూలాలివై నట్టి ♦ నిన్ను నిట్లు
భీకరారణ్యమందున ♦ విడుచుచుంటి
అక్కటా యెంతపాపంబు ♦ నాచరించి
నాఁడనోకదా పూర్వజ♦న్మంబునందు.

తల్లీ! నిరంతరమును నతిభక్తితో నగ్రజుని నిన్నును సేవింపుచు నరణ్యంబులకుఁ జనుదెంచిన మహాభక్తిగల యీలక్ష్మణుండే యిట్టికార్యంబొనర్చుట కొడిగట్టెనుగదా. అయ్యో! నీదీనదశంజూడ నాకు శోకంబు పొంగిపొరలుచున్నది. అంతమంది దానవులనెదుర్కొని పోరాడి చావక బ్రదికియుండుట నిన్నీరీతిని నట్టడవిని విడుచుటకే కాఁబోలు. ఓజననీ! ఈపరమకిరాతునకు నేమిదారిచెప్పెదవు!

సీత — మఱఁదీ! అగ్రజుని యాజ్ఞను నీవునెఱవేర్చితివి. ఇందుకునీవు చింతించెదవేల! భగవంతుఁడు నానొసటనెట్లువ్రాసెనో నాగతి యట్లుగాకమానదు.

లక్ష్మ —

ఉ॥ అన్నవచించె నన్ను గహ♦నాళిని పీడుమటంచు నిప్పు డీ
వున్న తెఱంగుజూడ మది ♦ యొప్పదు నిన్విడనాడి యేగఁగాఁ
గ్రన్నన రమ్మటంచు రఘు♦రాముఁ డనుజ్ఞ నొసంగె నయ్యయో
నిన్నిటు బాసియేఁగఁగల ♦ నీరజనేత్ర వచింపు మ్రొక్కెదన్.

జననీ ! ఆనాఁడు శ్రీరామచంద్రుండు కురంగంబును బట్టి తెచ్చుటకేఁగ, దానవుండు మచలవంచింప నఱచినప్పుడు నయ్యది నీవు గ్రహింప లేక రాముని జాడల నరసిరమ్మని నాకుఁ జెప్ప, నిన్ను విడనాడి యేగుటకు సమ్మతింపని నేను గరుణవీడి, కిరాతునికన్న నధముండనై యిప్పుడు విడనాడి యేగవలసివచ్చెనుగదా. (దైవమునుద్దేశించి) హా! దైవమా ! సూర్యకులంబున కెట్టిసంకటములు గల్పించితివి. త్రిలోకమాతా ! సీతా! సూర్యకులంబిక యభివృద్ధిబొందుటయెట్లు. అయ్యో ! నాకేమియుఁదోఁచకున్నది. ఇప్పుడేమిసేయుదును. నిన్విడనాడి యేగుటకుఁ గాళ్ళాడకున్నవి.

సీత—లక్ష్మణా ! ధీరపురుషుండవగు నీవేయిట్లు చింతించిన నాబోటి యాఁడువాండ్రెంత. నాకై నీవిట్లు ఘోరంబుగఁ జింతింపకుము. సూర్యకులంబే నాతోఁ బుట్టి దుర్యశంబునుసందక నాచంద్రార్క తారావనీశరథిస్థాయిగ వర్ధిల్లుగాక. మఱఁది! ఇంక నీవు నాకై మిగుల వగలంబొగలక పురంబునకు మరలుము.

లక్ష్మ—పతివ్రతాశిరోమణీ ! నిరపరాధవగు నిన్నీనట్టడవిని నెట్లువిడించి పోఁగలుగుదును. ఇంతకంటెనాకు మరణంబు జేకూరినచో బాగుంటుఁగదా. ఈనట్టడవిని నన్నేపామైనఁగరువరాదా! ఏవన్యమృగంబైనను నెత్తికొనిపోరాదా !

సీత—లక్ష్మణా ! వగవకుము. మాయన్నగారియాజ్ఞాప్రకారము నీవు నన్ను నిచ్చటవిడిచితివి. నీరాకకై మాయగ్రజుండు వేచియుండును. కావున నీస్వాంతంబున నాకై చింతను విడనాడి, పురంబునకేగుము. ఇంక నాకర్మంబెట్లున్న నట్లగును హృదయనాథుఁడే నాయెడల నిర్దయవహించినప్పుడు నేనుమాత్రము మాజీవనంబులభరించి బ్రదుకనేల. నీవేగినయనంతరమున నెట్లో యీజీవనములుపోవలసినవే.

లక్ష్మ—(తనలో) ఈమెవాక్యంబులు నాహృదయంబును భేదించుచు

న్నవి. ఇదివఱకే పొరలిపొరలివచ్చు శోకాంబుధి యిప్పుడు తరంగములతోఁగూడి యొప్పదొడఁగెనుగదా. అయ్యో! ఈసాధ్వీమణి పతితన్ను విడనాడెనని దుర్భరశోకాంబుధిని గూలి నేనేగిన యనంతరంబున నెట్టిఘోరకార్యంబును జేయసాహసించునోకదా. అయ్యో! ఏమియుఁ దోఁచకున్నది. (ప్రకాశముగా) జననీ! సాధ్వీశిరోరత్నమా! ఎంతమాట పలికితివి.

తే॥ గీ॥ భర్త విడనాడెనంచు దు♦ర్భరవిషాద
మగ్నవై బలవంతమా ♦ మరణమంద
నాత్మలోన నెంచకుసుమీ ♦ యవనిపుత్రి
భ్రూణహత్యామహాదోష ♦ మొందఁగలవు.

అమ్మా! నీవుమాత్రము మరణమందక కన్నులు రెంటను మూసికొని యెట్లో కాలమువెళ్ళదీయుము. బలవన్మరణమునందితివేని మహాపాపంబు సంభవించును.

సీత—లక్ష్మణా! నన్నుఁ జావకుండఁగూడఁజేసితివే. కానిమ్ము. నీవేగుము. నాకర్మగతి యెట్లున్నదట్లగుఁగాక. నీవు సాకేతంబునకేగి, భక్తరక్షణ పరాయణుండును, దీనమందారుండును, సకలరాక్షసలోకభయంకరుండును, రవివంశాంబుధిచంద్రుండుననగు, మన్నాధునితో 'త్వత్పాదారవిందంబులకు జానకి యతిభక్తితోఁ బ్రణమిల్లె' నని చెప్పుము. ముప్పురత్తలకును నానమస్కారంబులనిచెప్పుము. భరతశత్రుఘ్నులకు నాదీవనలని వచింపుము. లక్ష్మణా! నీవెప్పుడును నగ్రజుని యాజ్ఞానువర్తివై మెలంగుచు, యశంబునందుము. ఇంకనీవు సంశయింపకచింతను విడనాడి పురంబునకుమరలుము.

లక్ష్మ—(తనలో) ఆహా! ఈమెనెట్లుబాసిపోవఁగలను. అయ్యో! పోవకతప్పదు. ఆలస్యమైనచో రాముం డాగ్రహించును.

చ॥ జనకజ, రామచంద్రసతి, సజ్జనసంస్తుతిపాత్ర, సీత నా
యనుజునియాజ్ఞపైన గహనావళి నిన్ విడనాడిపోదు; నో
యనఘమనీషులార సుగుణాంచిత దేవతలార, భక్తితో
ఘనకృపతోడ నీమె నిఁకఁ గాచెడిభారము మీదెసుం డహో.

(ప్రకాశముగా) తల్లీ! నీకిదే నమస్కారమాచరించుచున్నాను. నాకింక ననుజ్ఞనిమ్ము.

సీత—లక్ష్మణా! మీయందఱికిని శుభంబగుఁగాక మనుకులంబు వేయేండ్లకును వర్ధిల్లవలయు నీవేగుము.

లక్ష్మ—(నిష్క్రమించుచున్నాఁడు)

సీత—(తనలో) ఆహా! లక్ష్మణుండు నన్నువిడిచి పురంబున కేగినాఁడు. ఇంక నేనేమిసేయుదును. ఈనట్టడవిని నాకు దిక్కెవ్వరు! ఇప్పుడెక్కడికిపోవుదును. (ఆలోచించి) పుట్టినింటికిఁబోయినచో బాగుండునా! నాధుని చేవిడనాడఁబడి యేమొగంబుతో నచ్చటికిఁ బోగలుగుదును. అంతకంటె నీచమేమైనయున్నదా! (ఇంచుకయూరకుండి) ఎన్నివిధంబులుజూచినను నాకేమియు దారిగానుపింపకున్నది. ఇంకనాకు మరణమేశరణము. ఓవన్యమృగంబులారా! నన్నుమ్రింగివేయరాదా! ఓగంగాభవానీ నన్నునీలోఁజేర్చుకొనరాదా! ఏమైననుసరే. నేనీనదింబడి నాప్రాణంబులఁబాసెద. (రాముదుద్దేశించి) హా! సద్గుణసముద్రా! రామభద్రా! నీపాదారవిందసందర్శనంబు నాకీజన్మంబునఁజూచుభాగ్యములేదుకదా. హృదయేశ్వరా! నీయశశ్చంద్రికనుగాపాడుకొనుటకై నన్ను విడనాడినందుకు నేను జింతించనుగాని నీచరణదాస్యము బాయవలసివచ్చినందుకుమాత్రము చింతించుచుంటి. మనోహరా! ఎన్నిజన్మములకైనను నిన్నే నాకుఁబతిగా ననుగ్రహించుటకుఁబరమేశ్వరునిబ్రార్థించుచున్నదాన. (ఆలోచించి) ఇంకనే

నాలోచింపనేల. వేగమే యీగంగయందుఁబడి జీవంబులఁబాసెద. (అని యించుకనడచి) అయ్యో! మఱచితిని లక్ష్మణుండు నన్ను బల వన్మరణంబునందవలదనియు, దానివలన భ్రూణహత్యాదోషంబు సం భవించుననియు, వచించెనుగదా. కావున నేనిప్పు డట్టికార్యమును సేయరాదు. లక్ష్మణా! నన్నీరీతినిడించిపోయినవాఁడవు పోక చావ కుండఁగూడఁ జేసితివికదా. అయ్యో! నేనేమిసేయుటకును దోఁచకు న్నది. దాహం బధికంబగుచున్నది. నడచుటకుఁ గాళ్ళాడకున్నవి. (అని కూర్చుండును)

వాల్మీకి—(ప్రవేశించి) ఇచ్చటనెవ్వరో స్త్రీయున్నయట్లు దోఁచుచున్న దే. పాపమీయామె యెవరోకదా. కనుఁగొందుఁగాక (ఇంచుక యూర కుండి) "రామనామతారకం భక్తిముక్తిదాయకం"

సీత—(తనలో) ఆహా! నానాథుని నామంబును నెవ్వరో స్మరింపుచు న్నారు. (పరికించి) ఓహో! ఎవ్వరో మునిపుంగవుండు.

వాల్మీకి—(సీతనుసమీపించి)

ఉ॥ ఎవ్వరిదానవీవు జల ♦ జేక్షణ నీయభిధానమేది, నీ
వెవ్వరికిన్ జనించితివి ♦ యెవ్వఁడునీకగునాథుఁ డొంటిగా
నివ్వనభూమి కేమిటికి ♦ నిట్లరుదెంచితి వక్కటక్కటా
జవ్వనిసేమదిన్ గను వి♦చారము నొందగనేల చెప్పుమీ.

సీత—తాపసేంద్రా! నమస్కారము.

తే॥ గీ॥ జనకభూపాలునకు నాత్మ ♦ జాతనౌదు
రవికులాంబుధిచంద్రుఁడౌ ♦ రామభూప
వర్యునకు నెంతయోకూర్చు ♦ భార్యనగుదు
సీతయందురు పేరు వి ♦ ఖ్యాతచరిత.

వాల్మీ—అహా! ఏమి! అమ్మా! నీవు జనకరాజపుత్రికవా! శ్రీరాము

వేందు)ని భార్యవా ! సీతవా ! నేడు నిన్నుఁ జూడ గలుగుటం జేసి నా జన్మము పావనం బైనది. నాతపంబు ఫలించినది. తల్లీ! త్రిభువన వంద్యవై యలరారు నీవిట్లేకతంబున నియ్యరణ్యంబున కేలవచ్చితి వి. నీ వెందులకో విచారించుచున్నట్లు గాన్పించెడి. నాయందుఁ గృ పవహించి చెప్పుము.

సీత—త్రిలోకపూజితపాదపంకేరుహా ! మౌనీంద్రచంద్రా ! జీవంబులను బాయుటకు సంసిద్ధనై యున్న నాకు నీవిప్పుడు గనిపించితివి. నీపాదా రవిందసందర్శనంబున నాకించుకసంతాపము తగ్గినది. సమస్తంబును దెలిసిన నీకు నాసంతాపంబునకు మాత్రము కారణము దెలియకుండు నా ! ఎంతటిదాననైననేమి. నేఁటికిట్లు పతిచేఁ బరిత్యజింపఁబడి యీ నట్టడవిని నాతిఁ గాంచక్కి పరితపించుచుంటి. తాపసోత్తమా ! నాకిం క నేవిచారంబును మనంబున లేదు. నాజీవంబులను బాయుటకుమా త్రము మార్గము దెల్పి నన్ను రక్షింపఁగోరెద.

వాల్మీ—(ఆలోచించి తనలో) ఓహో ! ఈమెను శ్రీరాముం డెందులకీ రీతివిడనాడెనో దివ్యదృష్టిని దెలియుచున్నది. (ప్రకాశముగా) అ మ్మా ! నీవిచారమునకుఁ గారణంబు నేఁ గనుఁగొంటిని. నీవిభునకు నీపై నాగ్రహ మెట్లువచ్చెనో దయయు నట్లేవచ్చి నిన్నుఁ బాలిం పఁగలఁడు. ఇంక నీవు విచారింపవలదు. నీకేమియు భయంబువల దు. ఇచ్చటకు సమీపంబుననే నాయాశ్రమంబున్నది. నీవు నావెం టరమ్మా. నీకచ్చట మునికన్యకలు నీయిచ్ఛవచ్చినయట్లు సపర్యలు చేయుదురు. నీకేమియుఁ గొఱంత గలుగదు. నీతండ్రియగు జన కుం డెట్లు నిన్నుఁ గాపాడెనో యట్లే కాపాడెద. మఱియు, సమస్త శాస్త్రవేత్తలును, శౌర్యధనాఢ్యులును నగు నిరువురు సుపుత్రులు నీకుద్భవింపగలరు. వారు నావలన సంపూర్ణవిద్యాప్రవీణులు కాగ లరు. ఇంక సందియుంబందక రమ్మా.

సీత—మునివర్యా! జనకునిరీతి మీరట్లు వక్కాణించుచుండ నేనేమి చెప్పుదును. అమోఘవచస్కులగు తమవాక్యములు రిత్తయగునా! మీచిత్తము వచ్చిన ట్లాచరించెదను.

వాల్మీ—సాధ్వీమణీ! రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.







# శ్రీరామాశ్వమేధము.

## తృతీయాంకము.

[రామునిసౌధము, ప్రవేశము—రాముఁడు]

రాము—(స్వగతము) ఆహా! నే నెంత కఠినహృదయుండను. ఎవఁడో పామరుం డాడినపలుకును సాకుజేసికొని సీత నరణ్యముల పాలుగావించితినే. అయ్యో నేనెంత ఘోరపాతకం బాచరించితిని. ఇట్టి కార్యంబుసేయుదునని నే నెన్నఁడైనను దలంచి యుంటినా! ఇయ్యది జనకరాజెఱింగి తనపట్టికై యెంత చింతించునో. ఇట్టి దుష్కార్యంబును నేనాచరించితినని నాపై స్వాంతంబున నెంతయలుగునో కదా. అక్కటక్కటా! నన్ను నిరంతరంబును భక్తిమీఱ సేవించు సాధ్వీమణి; ఒక్క త్రుటికాలంబైనను నన్నెడఁబాయఁజాలక సకల సంపద్భోగంబులను ద్యజించి నావెంటఁగూడి యరణ్యంబుల కేతెంచిన తన్వీమణి. అరణ్యంబునందు మాయకురంగంబువెంటనేగ, మమ్ము వంచింప, దానవుండు "హాలక్ష్మణా! సీతా" యంచు నఱచినప్పుడు నాకేమికీడువాటిల్లెనోయని భీతినొంది, తానొంటరిగ నుండవలసివచ్చునని యైనను దలంపక నాపైఁగల ప్రేమచే, లక్ష్మణుని సత్వరమ్ముగ నాజాడల నరయఁ బంపిన నిరంతర భర్తృపాదారవింద యుగళధ్యానాసక్తచిత్త. అట్టి సుగుణంపుపేటి, జనకరాజపుత్రి, నాపట్టమహిషి నకారణంబుగ నడవులపాలు గావించి యీకరణి నిర్భాగ్యునివలెఁ జింతింపుచుంటినికదా. అయ్యో! ఈకార్యంబు సేయవలదని నాతమ్ము లెంత చెప్పినను వినకపోతినే.

(సీతనుద్దేశించి)

చ॥ ధరణి కుమారివై దశర♦థక్షితిపాలుని పెద్దకోడలై
సురరిపు మర్దనుండనయి ♦ శోభిలుచుండెడి నాకు భార్యవై
పరఁగిన సీతకున్ ధరణి♦పైఁ బెనుబాములు దప్పవయ్యెఁగా
హరహర! భారతీరమణుఁ ♦ డామె ముఖంబున నేమివ్రాసెనో.

హా! సీతా! పూతచరిత్రి! సుగుణసంఘాతా!

మ॥ వనవాసంబును బూర్తియయ్యెఁ బురిలో ♦ వాసంబునుం జేయుచున్
ఘనసౌఖ్యంబులు బొందువారమనుచున్ ♦ గాంక్షించితింగాని, యో
వనితా నిన్ మరలన్ వనంబులకు నేఁ ♦ బంపింతు నంచున్ మదిన్
గననైతిన్గద యెంత క్రూరుఁడనో హా! ♦ కాంతామణీ జానకీ.

అక్కటా! జనకరాజపుత్రీ! హేమగాత్రీ! ఎవఁడో నీచకులసంజాతుఁ డాడిన మాటలపై దుర్యశంబు సంభవించునని తలంచి నిన్నీరీతి మరల నడవులపాలు గావించితినిగదా! నీగుణంబుంగూర్చి నేనెఱింగియు మోసపోయితినిగదా.

తే॥ గీ॥ అనలుఁ డంతటివాఁడె యి♦య్యవనిపైని
సీత ఘనపతివ్రతయంచుఁ ♦ జెప్పగానె
కొంటిఁగాదె యపుడు నిన్నుఁ ♦ గోర్కెతోడ
నిప్పుడీరీతి జేసితి ♦ నేమిసేతు.

తే॥ గీ॥ నిండుఁ జూలాలవైనట్టి ♦ నిన్ను; పాప
మంచు నించుక నెంచక ♦ నడవిపాలు
జేసితినిగదా యక్కటా ♦ సీత! సాధ్వి
యెంత క్రూరుండనోకదా! ♦ యెంచిచూడ.

అకటా! కాంతామణీ! నాయట్టి నిర్భాగ్యునకు భార్యవై యలరారుట చేతనేకదా యిట్టి యిక్కట్లపాలైతివి.

తే॥ గీ॥ పుట్టి నింటనేసుఖములఁ ♦ బొందినావొ
కాని; మెట్టినింటనునేమి ♦ కానవైతి
వడవులందున వాసమే ♦ యయ్యెఁ జింత
వార్తిసెనా నీముఖంబున ♦ వారిజాక్షి.

అయ్యో ! సీతా ! లేక లేక గర్భంబు ధరించితివనియు, నందనోదయ భాగ్యంబునందుదునని యెంతయో స్వాంతంబునసంతసించితినిగాని యీరీతిని నిన్ను గాననంబుల బాలుగావించు కఠినాత్ముండవగుదునని మనంబున నెన్నఁడును దలంపలేదుకదా. హా ! రమణీశిరోమణి !

చ॥ వనమున నిన్నువీడుతరి ♦ భవ్యగుణుండు సుమిత్రిపట్టి; నీ
కును నిదికారణంబనుచుఁ ♦ గోమలి ! చెప్పగనెట్టితీరునన్
మనమునఁజింతనొందితివొ ♦ పాణవిభుం డనునెట్లుదూరితో
వనములపాలుజేసితని ♦ భావమునందున సుందరీమణీ.

సతీమణీ ! నందనవనసమానోద్యానవనంబులయందైనను విహరింపనొల్లని కాంతవునీవు భీకరారణ్యంబున నొంటరిగ నెట్లుంటివి ప్రాసాదంబులనెక్క భయపడు నీవు కఠినశిలావృతమైన కొండగుట్టల నెట్టులెక్కుచుంటివి ! క్రూరమృగంబులంజూచి యేరీతిభయమందుచుంటివో. నేనిట్టి పాపకార్యంబాచరించితినని నన్నెట్లు దూరనాడుచుంటివో. నన్నెడఁబాయలేక నరణ్యంబులకు నన్నుఁగూడివచ్చిన నిన్నిప్పుడెడఁబాసి నేనెట్లు ధరణిపై జీవంబులభరించియుందు. హా ! విదేహరాజతనయా !

తే॥ గీ॥ వెనుకముందునుజూడక ♦ వనని వాసి
గాగనొనరించినాఁడను ♦ కరుణలేక
మరల నినుఁజూచు టెట్టులో ♦ మగువమిన్న
ఎవరితో జెప్పికొందును ♦ నేమిసేతు.

లక్ష్మ—(విచారముతోఁ బ్రవేశించి తనలో)

తే॥ గీ॥ జనకజను పూతచరితను ♦ సాధ్వినకట
వనములందున విడనాడి ♦ వచ్చినాఁడ
నంచు రామునితో నెట్లు వ♦చించువాఁడ
నక్కటా తోఁచదయ్యెను ♦ నాత్మయందు.

అయ్యో ! ఇట్టికఠినవార్తను రామున కెట్లుఁగి వినిపింపఁగలను. విని
పించినంతనే రామచంద్రుఁ డెట్లుచింతించునోకదా. అక్కటా ! ఏ
మియుఁదోఁచకున్నది. (నలుదిక్కులుంజూచి) ఇదుగో రామచంద్రుం
డిచట నొంటిగఁగూర్చునియున్నవాఁడు. సీతనెడబాసినందులకే చిం
తించుచున్నట్లున్నది. ఈవార్తఁగూడ నేనిప్పుడే వినిపించవలసివచ్చె
నుకదా. (రామునిజేరి)

మ॥ ఇది పాపంబనియైన లోఁదలపకే ♦ యింతేని నీయాజ్ఞపై
మదిరాక్షిన్ ఘనసాధ్వి జానకిని భా♦మారత్నముం గానన
ప్రదరంబందున డించివచ్చిన మహా♦పాపాత్ముఁడీలక్ష్మణుం
డిదె దండంబులఁ బెట్టుచుండెఁ గయికో♦మ్మా రామచంద్రప్రభూ.

(రామునిపాదంబులకు మ్రొక్కుచున్నాఁడు)

రాము—(లక్ష్మణునిజూచి) తమ్ముఁడా ! నీవేమిచేసితివి ! నీవెప్పుడును
ధన్యుండవే.

తే॥ గీ॥ నాకు నర్ధాంగియైనట్టి ♦ నాతిమిన్న
నిందఁజూలలటంచును ♦ నెంచకుండ
కాననంబును జేర్చిన ♦ కఠినమతిని
పాపకర్ముండ నేనె సు♦భావచరిత.

ఇందు నీలోపంబేమియులేదు. (ఇంచుకయూరకుండి) అనుజా! సౌమిత్రీ!

ఉ॥ ఏసతికై శరాసనము ♦ నెంతయునంచితో శౌర్యమూని నే
నేసతికై విరాధు నవు ♦ డియ్యవనిన్ దునుమాడినాఁడనో
ఏసతికై బలారిసుతు ♦ నిట్టెవధించితో పేరుగాంచితో
ఆసతి సీత నిప్పు డక♦టా యడవిన్ విడనాడినచ్చితే.

సీ॥ ఏతన్విజాడల ♦ నెఱుఁగఁగాఁదలపోసి
వానరానీకంబు ♦ బంపినామొ
ఏరామకై నాఁడు ♦ వారాసి దృటిలో
నంచితంబుగఁ దరి ♦ యుంచినామొ
కాలకాలునివిబోలు ♦ కాలనేమిని లీల
నేతన్వికై కూల్చి ♦ మొగడినామొ
ఏయింతికై యప్పు ♦ డింద్రజిత్తుని నని
బరిమార్చి ఖ్యాతితో ♦ వరలినామొ

తే॥ గీ॥ యసురవర్గంబునెల్ల నే♦యతివకొఱకు
ఘోరసంగ్రామమందునఁ ♦ గూల్చినామొ
యట్టివై దేహి నిప్పుడు ♦ నట్టడవుల
విడిచియే తెంచినాఁడవే ♦ వీరచరిత.

తే॥ గీ॥ సకల భువనంబు లెప్పుడు ♦ జాలభయము
నందఁ; జరిఘుంపుచున్నట్టి ♦ యసురనాథు
రావణుని గూల్చియుంటి మే♦రమణికొఱకు
నట్టిసీతను వనిలోన ♦ నకట ఇపుడు
వీడి యేతెంచినాఁడనా ♦ వీరచరిత.

(అని చింతించుచున్నాఁడు)

లక్ష్మ—(తనలో) అక్కటా! ఇయ్యనఘుండు సీతం దలంచుకొని యె
ట్లు చింతించుచున్నాఁడో. అయ్యో! ఇప్పుడీతని నేమని యూరడిం

పఁగలవాఁడను! (పశ్చాత్తాపముగా) అన్నా! సోదరవత్సలా! కావున మా డ్కని నామెందలంచుకొని చింతించుట పాడిగాదు.

రాము—లక్ష్మణా! సీతను దలంపకయుండు టెట్లు.

చ॥ వనమున నేను బోవుతఱి ♦ వాసముసేయను పట్టణంబులో
నిను విడనాడి యొక్కక్షణ ♦ మేనును వెంటనె వత్తునంచు నుర్
ఘనముగ బల్కినట్టి వర♦కంజదళాక్షిని జానకీసతిన్
మనమున నెంచి చింతిలుట ♦ మానుటయెట్టులు చెప్పు లక్ష్మణా.

లక్ష్మ—అన్నయ్యా! సహజధైర్యశాలివగు నీకు నేను జెప్పునంతటివాఁ డనా. ఊరడిల్లుఁడు.

రాము—తమ్ముఁడా! లేక లేక గర్భంబుదాల్చిన తలిరుఁబోడిని పాపము నిర్దోషియైనను దలంపక కారుణ్యహీనుండనై నట్టడవికిం బంపి నే నింక ను జీవంబులఁదాల్చి యున్నందుకుఁ జింతింపుచుంటి. ఎవఁడో పామ రుండు పలికినపలుకులు పాటించి యీరీతి నాసతిని గాసిజేసితిని గాని యామె మహాసాధ్వియని యెఱింగియు నట్లు సేయఁగూడదను తలఁ పు జనింపకపోయెను గదా.

లక్ష్మ—అగ్రజా!

తే॥ గీ॥ పాపములపైనఁబడి బ్రతి♦మాలుకొంటి
వలదు వలదంచు నిక్క విన♦వైతివపుడు
యశము గాపాడికోనెంచి ♦ యట్లుబంపి
సీత; మదిలోన నిప్పుడు ♦ చింత తగునె.

(భరతశత్రుఘ్నులు—ప్రవేశము)

భర—(శత్రుఘ్నునితో) తమ్ముఁడా! సీతామహాదేవిని గానవంబుల యందు విడిచిన లక్ష్మణుం డిప్పుడే వచ్చినాఁడు. అదిగో అగ్రజుం

డు సీతనెడబాసినందులకుఁ జింతిరిపుచుండ, లక్ష్మణుం డూరడింపు చున్నాఁడు. మనముగూడ శ్రీరాముని సన్నిధిం జేరుదము. రమ్ము.

(రామలక్ష్మణులను సమీపించుచున్నారు)

భర—శత్రు—(రామునిజూచి) అగ్రజా! నమస్కారములు.

రాము—తమ్ములారా! అటుఁ గూర్చుండుఁడు.

(భరతశత్రుఘ్నులు గూర్చుందురు)

రాము—తమ్ములారా!

తే॥ గీ॥ పామరుండాడు వాక్యముల్ ♦ పాటిజేసి
పడఁతి నారీతిబాసిన ♦ పాపరతుఁడ
బ్రదికియుండగ నేఁటికి ♦ భవ్యరాష్ట్రి
మేల! భోగంబులేల నిం ♦ కేలసుఖము.

ఇంత కఠినాత్ముఁడు, నిట్టి మహాపాపి, యిట్టి కారుణ్యహీనుండు, నిట్టి జ్ఞానశూన్యుండు, ప్రపంచంబున నెందును లేఁడుకదా!

భర—అగ్రజా! గతించినదానికి నీవంటి యుత్తమజ్ఞానసంపన్నులీకరణి విచారించుట భావ్యమా?

తే॥ గీ॥ పుడమిఁ గేవలమవతార ♦ పూర్ణ పురుషుండ
వగుచు జన్మంబుగాంచిన ♦ యట్టివాఁడ
వీవు, లోకైకమాత య♦య్యింతి; సీత
లక్ష్మి; కాదుకో సుగుణల♦లామ! రామ.

అన్నయ్యా! సామాన్యమర్త్యునివలె నీవుగూడఁ జింతించిన నేనేమనగలవాఁడ. సాక్షాద్విష్ణ్వంశసంభూతుండవు.

తే॥ గీ॥ సీత నిను బాయగాలేదు ♦ సిద్ధమిద్ది
నీవు నామెఁ బాయఁగలేదు ♦ నిక్కముగను

ఆమెయందున నుంటి వీ♦నఘనమూర్తి
ఆమె నీయందునుండె నా♦ద్యంతరహిత.

విష్ణుమూర్తి నివీడి లక్ష్మి నివసింపనెంచునా ?

శత్రు—అగ్రజా ! కడచినదానికి నీవీరీతిఁ జింతింపనేల ! ఇంక ముందుఁ గర్తవ్యమేమియో విచారింపుఁడు.

రాము—తమ్ములారా ! ఏమికర్తవ్యము. ఇప్పుడు మరల సీతను దో డ్తెచ్చినచో మరింత దుర్యశంబు ప్రాప్తించునుగదా. కావున నాసం గతినేమియుఁ దలపెట్టరాదు. అట్టి పూతచరిత్రను కారుణ్యముబూ నక నట్టడవికింబంపిన నాకీరాజ్యంబును సుఖంబులేల ! నేనును సర్వ సంపద్భాగ్యంబులును, సుఖంబులును ద్యజించి, కాననభూమిం బ్ర వేశించి తపోవృత్తినుండెదను. అట్టి తరుణీరత్నమే లేనప్పుడు నాకివి యన్నియు నేల !

లక్ష్మ—అగ్రజా ! ఎంతమాటపల్కితివి. మాయానందమునకును, సౌ ఖ్యంబునకును హేతువైన నీవే రాజ్యమునువీడి యేగుచుండగా మేముమాత్రము పురంబునందుండి సౌఖ్యంబుల ననుభవించుచుఁ బురంబున నుందుమా ! మేముఁగూడ నీవెంటఁ జనుదెంతుము. మ మ్ముఁగూడఁ గొనియే కాననంబులకేగుము.

రాము—ఈనిర్భాగ్యునితో మీరుగూడ గష్టంబులందనేల. తమ్ములా రా ! సీత నాయందఁడలేనప్పుడు నేనింక బ్రదుకనేమి బ్రదుకకేమి ! (ఇంచుకయూరకుండి) హా ! సీతా విదేహరాజపుత్రీ ! నిన్నెట్టి యిడు మలపాలుజేసితినే. ఇట్టి పాపాత్ముఁడనగుదునని యెన్నఁడును నీవు దలంపవైతివికదా ! అయ్యో ! ఖడ్గవ్యాఘ్రసింహామదేభాది క్రూర మృగంబుల కాకరంబైన ఘోరారణ్యమే నీకుఁ బురంబయ్యెనా ! కఠినశిలావృతంబైన రానేలయే నీకుఁ బూవులపాన్పయ్యెనా ! కర్ణ

కఠోరంబగు సృగాలరవంబులే నీకు వీణారవంబులా! కందమూలఫ
లంబులే నీకుఁ బంచభక్ష్యపరమాన్నంబులాయెనా! అక్కటా! సరే
నీకును నాకును ఋణము దీరిపోయెనా! కట్టా! ఎంతకష్టము. న
న్నుఁ బెండ్లాడి నిరంతరమును సౌఖ్యంబుల నందుదువని నీజనకుండు
తలంచినందుకు, నడవులును, గొండగుహలును నీకు వాసభవనంబు
లయ్యెనా! హా! సీతాసతీ! నీవే నన్నువిడనాడి యేగ, నాకీభోగం
బులేల! నా ప్రాణంబులేల! (చింతించుచున్నాఁడు)

భర—అగ్రజా! నీ కిదియేమివెఱ్ఱి. గతించినదానికై యీగతిఁ జింతిం
చుట నీబోటి యుత్తమజ్ఞానసంపన్నులకుఁ దగునే. నీకంటె మాకె
క్కువ తెలియునా! మాయందుఁ గృపవహించి విచారంబును వి
డువుము.

రాము—తమ్ముఁడా! ఆజనకజను దలంచికొని చింతింపకయుండుటెట్లు.
అక్కటా! లేక లేక గర్భంబుదాల్చెననియుఁ, గుమారులం బడయు
ననియు మోదంబునందితినిగాని యీరీతి నాసతిని గాసిజేయుదునని
తలంపనైతినికదా!

భర—అగ్రజా!

చ॥ కడచినదానికిన్ వగవ ♦ గాఁ జనునే నినుబోటిధీరు; లి
ప్పుడు హయమేధయాగమును ♦ బొందుగఁ జేయుము; దానిచేతనున్
బడయుదువయ్య సౌఖ్యములు ♦ భావమునందునఁ జింతబోవు; నా
పలుకులు విశ్వసింపుము వి ♦ పన్నజనావన; సోదరాగ్రణీ.

లక్ష్మ—అవును. దానంజేసి చిత్తశాంతికలుగును.

శత్రు—అదితప్పక చేయవలసినదే.

రాము—తమ్ములారా! ఈసంగతి నాకుఁ జక్కగజ్ఞప్తికిదెచ్చిరి. సర్వపాప
క్షయకరంబైన యీమఖంబును జేయవలెనని నాకెన్నిదినంబుల

నుండియొక కోరికయున్నది. అయ్యది నెరవేరుదినం బిప్పటికిఁ బ్రా
ప్తించినది. (శత్రుఘ్నునిజూచి) తమ్ముఁడా శత్రుఘ్నా ! నీవేగి సత్వరం
బుగ వసిష్ఠమునీంద్రుని దోడ్కొనిరమ్ము. ఈసంగతి నమ్మునివరే
ణ్యునితోడ నాలోచింతము.

శత్రు—చిత్తము. (నిష్క్రమించి వెంటనే వసిష్ఠునితోఁ బ్రవేశించుచు
న్నాఁడు)

(వసిష్ఠునిజూచి యందఱును నాసనంబులనుండి లేచి నిలువంబడి నమస్క
రించుచున్నారు)

రామ—మునికులతిలకా ! ఆభద్రపీఠంబున నాసీనులగుఁడు.

వసి—(ఆసీనుఁడగుచున్నాఁడు)

రామ—మౌనీంద్రచంద్రా ! రావణవధచేఁగలిగిన బ్రహ్మహత్యాదో
షంబును బోగొట్టుకొనుటకును, సీతనెడబాయుటచేఁ గలిగిన దుఃఖం
బు శాంతించుటకును, నశ్వమేధయాగంబు జేయసమకట్టితి. ఇందుం
గూర్చి మీరేమియభిప్రాయంబు నొసంగుదురోయని రావించితిని.

వసి—రామచంద్రా ! సమస్తపాపక్షయకరంబును; సకలపుణ్యప్రదం
బును నగు నమ్మహాక్రతువుంజేసి భూధవులయందుఁగీర్తిని నీవు ము
ఖ్యముగ నొందవలసినదే. కావున నీవద్దానిని దప్పకచేయుము.

రాము—మీయాజ్ఞను శిరసావహించెదను. కాని నాకొక్కటిమాత్ర
ము సందియంబగుచున్నది. అపత్నీకుఁడు మఖంబుసేయవచ్చునా !
అగ్నిహోత్రాధికారంబులు సతులులేక వచ్చునా !

వసి—రామా ! నీవాసందియంబును నేమియు డెందంబుననందవలదు.
అష్టాపదరూపంబున సీతనుగల్పించి యాకొఱంతలేకుండఁ, గ్రతువును
జేయవచ్చును.

రామ—అందుకు ధర్మశాస్త్రంబు లొప్పుకొనునా !

వసి—నిరాఘాటంబుగ నొప్పుకొనును.

రాము—అట్లయినచో సందియమేమియున్నది. మీరు మాయందుఁ గృపవహించి యజ్ఞంబు పూర్తిసేయింప మిమ్ముఁ బ్రార్థించుచున్నాఁడ.

వసి—క్రతువు పూర్తియగుట కేమియు సందియముండదు. సాక్షాద్విష్ణ్వంశసంభూతుండవగు నీవొనర్చు క్రతువున కేవిధమయిన భంగమును రాదు. సవనంబున కారంభించి దీక్షనుబూనుము. ముందుగ యజ్ఞబిగుదపట్టంబునుగట్టి మఖాశ్వంబును భూచక్రంబెల్లఁ జరింపఁ బంపవలెను. ఆయశ్వరక్షణార్థమై వెంట ననేకమహావీరులఁ బంపవలెను. అయ్యది యెవ్వరిచేతనైనను బట్టుబడెనేని యజ్ఞంబునకు భంగంబు గలుగును.

రాము—సవనంబు జరపించుభార మంతయు మీభుజస్కంధమునందుఁ బెట్టి నేను గ్రతుదీక్షం బూనెదను. యజ్ఞాశ్వంబు వెంట శత్రుఘ్నుం డేగును. బంధుజనంబులను బిలచుటకు భరతుండును, జనకమహారాజునుదోడ్కొనివచ్చుటకు సౌమిత్రియు నరుగుదురు. (శత్రుఘ్నునిజూచి) తమ్ముఁడా! శత్రుఘ్నా! నీవు మఖాశ్వంబువెంట నేగుము. ఎవ్వరైనను బరాక్రమంబున విజృంభించి దానింబట్టిరేని "రావణవధచేఁగలిగిన బ్రహ్మహత్యాదోషంబు నివారణకై యీయాగంబు సేయఁబడుచున్నది. భూపతులందఱికంటె నెక్కువవారమనియు నందఱికంటె ఖ్యాతినందదలంచి చేయుటలేదు. మాయందుఁగృపవహించి యాగమహోత్సవంబును జూడరం" డని చెప్పుము. అందుకు వారువినక యశ్వంబును వదలనిచో వారిపైన నాగ్రహంబువహించి వారిని వధింపక గుఱ్ఱంబుల నదల్చియో, తేరునుదోలియో పరాక్రమంబును జూపి భయపెట్టుము. (భరతునిజూచి) భరతా! నీవేగి మనబంధుజనంబుల నందఱికిని నావిన్నపంబునుదెల్పి తోడ్కొనిరమ్ము (లక్ష్మణునింజూచి) సౌమిత్రీ! నీవలన నిక్కార్యంబు నెఱవేరును. జనకమహారాజుం దోడితెచ్చుటకు నీవే తగినవాఁడవు. నీవాయనసన్నిధి

కేగినప్పు డాయన యొకవేళ కోపంబున నెద్దియైనఁబలికిన నీవేమిఁ మాఱుపలుకక నమస్కరించి నావచనంబులుగా నిట్లు విన్నవింపుమ

తే॥ గీ॥ భవ్యభవదీయపుత్రిని ♦ భావమందుఁ
గరుణబూన కీరీతి నుఁ♦గ్రాటవులకుఁ
బంపినాఁడ నటంచును ♦ భావమందు
నాగ్రహింపకయుండ మీ♦యంఘ్రిచయము
మౌళిపైఁదాల్చి కడుబ్రీతి♦మ్రొక్కుకొందు.

తే॥ గీ॥ రావణవధచేఁ గల్గిన ♦ బ్రహ్మహత్య
పాతకంబును బాపుకో ♦ మదిఁదలంచి
సల్పుచున్నాఁడ నిప్పుడీ ♦ సవన మయ్య
సరగనే తెంచి నాయందుఁ ♦ గరుణఁబూని
యాగమగునట్లు చూడుఁడీ ♦ యతిముదమున.

తే॥ గీ॥ కూఁతుఁ గానకుఁబంపిన ♦ నీతిరహితుఁ
డంచు మీదుచిత్తంబున ♦ నెంచవలదు
మిమ్ముజూపించి మాతండ్రి ♦ పృథ్విబాసె
తండ్రివాదుపు కాదొకో ♦ ధారుణీశ॥

తే॥ గీ॥ కూఁతురుండిన మీరలే ♦ కోర్కతోడ
బిలువకుండనె వత్తురు ♦ లలితచరిత
కూఁతులేనప్డు వచ్చుటే ♦ గొప్పయగును
కరుణబూనుము మాయందు ♦ ఘ్నాతలేంద్ర.

లక్ష్మ—చిత్తము.

రాము—తమ్ములారా! మునివర్యా! ఇంక మనమేగి తగుప్రయత్నం బున నుందము రండు. (అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది తృతీయాంకము.





# శ్రీరామాశ్వమేధము.

## చతుర్థాంకము.

స్థలము:—వాల్మీకాశ్రమప్రాంతోపవనము, ప్రవేశము:—లవుఁడు, మునిబాలుఁడు

లవు—మిత్రమా! ఈవనం బెంతరమణీయంబుగ నున్నదో చూచితివా! ఇందలి పుష్పంబు లెట్లు శోభిల్లుచున్నవో కంటివా! ఈవనంబుననుండు పుష్పంబులు భగవదార్చన కనుదినంబును వినియోగపడుచుటంజేసియే యీవనం బింతగమణీయంబుగ నుండుటయు, నీపుష్పంబు లిట్లు శోభిల్లుటయుఁ గదా.

ముని—సఖుఁడా! అందుకు సందియంబేమున్నది. భగవంతున కర్పింపఁబడుచుండుటచేతనే యింతశోభ వహించియున్నవి.

లవు—మిత్రమా! మన మావృక్షముక్రింద నొక్కింతకాలము కూర్చుందము రమ్మా. (అని యిరువురును వృక్షముక్రింద నాసీనులగుదురు)

లవు—హితుఁడా! అటుఁజూడుము.

సీ॥ వైరమింతయులేక ♦ వరకురంగములకుఁ
బాలిచ్చుచుండిన ♦ వ్యాఘ్రచయము
భీతియింతయు లేక ♦ మృగరాజుతోఁగూడి
వర్తించుచుండిన ♦ వారణములు

పరమముదంబున ♦ బావురుపిల్లితో
భుజియించుచుండిన ♦ మూషకతతి
సాళువంబులముందు ♦ జంకక కేళిని
సల్పుచుండెడి పక్షి ♦ సముదయంబు

తే॥ గీ॥ చూచినంతనె యెంతయో ♦ చోద్యమగుచుఁ
గానుపించుచు నుండెను ♦ గాంచుమయ్య

ముని—— మనదుగురువరేణ్యుని దివ్య ♦ మహిమచేత
నిట్టులుండెనంచును నెంచు♦మీా! హితుండ.

లవు——అవును. నిశ్చయముఁగ మనగురువులవారి తపోమహిమచేతనే యీామృగంబులు తమతమ వైరంబులు విడిచి, యాశ్రమప్రాంతమున నీరీతి సంచరించుచున్నవి. (ఇంచుక యూరకుండి) మఱచితిని. గురువులవారన్న జ్ఞప్తికివచ్చినది. వరుణలోకంబున కేగి సత్వరంబుగ నేతెంతునని చెప్పి, మనగురుండేగి పెక్కుదినంబులయ్యె. ఇంకను రాలే దేమికారణమో కదా!

ముని——ఏకారణంబుచేత నిన్నిదినంబు లుండిరోకాని సాధారణముఁగ నుండువారు కారు. నేఁడో రేపటనో తప్పక యరుదెంతురు.

లవు——వారాశ్రమంబున లేకపోవుటం జేసికదా మనమీారీతి విచ్చలవిడిగాఁ జరింపుచుంటిమి.

ముని——నిజమే.

(తెరలోఁ గలకలము)

లవు——ఏమి చెపుమా! మహాధ్వని వినవచ్చుచున్నది.

ముని——(ఎదుటంజూచి) మిత్రమా! అటుఁ జూడుము. మనమున్న దెసకే యొక తురంగంబును దానిసి వెన్నంటి కొందఱువీరులును వచ్చుచున్నారు.

లవు—(పరికించి) అవును. అదియేదియో యజ్ఞాశ్వంబని తోఁచును. దాని సంరక్షణార్థమై కొందఱు వీరులు వచ్చుచుండిరి. అదియేదియో మనము జూతము. ఆతురంగంబు మనలను సమీపించుచున్నది కదా.

ముని—మిత్రమా! అది యేదైనను మనకేమి. మనదారిని మన మాశ్రమంబునకుఁ బోవుదము. మనమిక్కడనున్నచో వారు మనలనేమైనఁ జేయుదురేమో.

లవు—హితుఁడా! ఎంతధైర్యశాలివోయి. మనలను వారేమిసేయుదురు. ఆసన్నాహమేమియో మనమును జూచియే పోవుదము. నీవెంతమాత్రమును భయంబునందక నాప్రక్కనుండుము. అదిగో తురంగము మనలను సమీపించుచున్నది.

(అంత నొకతురంగము లవుని సమీపించును)

లవు—(తురంగమును సమీపించి) మిత్రమా! చూచితివా! దాని యలికభాగంబున నొక బిరుదుపట్టంబు గాన్పించుచున్నది. అందేమి వ్రాయఁబడెనో చూచెదఁగాక.

ముని—మిత్రమా! దానిజోలి మనకేల. ఏమివ్రాసియున్ననేమి! మునికుమారులమైనమన కాసంగతులతో నేమిపనియున్నది.

లవు—చూచినందువలన నష్టమేమున్నది. (గుఱ్ఱమును బట్టుకొని బిరుదపట్టంబును జదివి)

తే॥ గీ॥ ‘‘క్రతుతురంగరాజ మిది వి◆రాజలీల
వీరసుపుసూనుచేతను ◆ విడువఁబడియె
శూరులెవరైన నున్నచో ◆ సొంపుమీరఁ
బట్టవచ్చు’’ నటంచును ◆ వ్రాసియుండె.

ఏమిదీ! వీరసుపుసూనుని చేత విడువఁబడిన క్రతుతురంగమా శూరులున్నచో బట్టవలయునా! ఈవ్రాఁత తురంగంబును విడిచినవాని శౌ

ర్య ధైర్య సాహస పరాక్రమంబులను దెలియపఱచుచున్న దే. శూ రులైనచోఁ బట్టుఁడని కదా వ్రాసియుండెను. ఏమీ! నేను శూరుఁ డను గానా! కాని యీ క్రతువాజిని నేనేపట్టెద. ఎవ్వ రడ్డమువ చ్చెదరో చూచెదఁగాక. (అని తనయుత్తరీయము తోఁ దురంగంబును వృక్షమునకుఁ గట్టును)

మని—(తనలో) ఈతఁడు కడు సాహసముచేయుచున్నాఁడు. దీనివలన నేమిహాని వాటిల్లునో! ఎట్లయినను నీతని నీయుద్యమమునుండి త ప్పించవలెను. (ప్రకాశముగా)

తే॥ గీ॥ మునికుమారులమైనట్టి ♦ మనము రాజ
చంద్రుచే వీడఁబడిన య♦శ్వంబు నిట్లు
బట్టినందున నేమిలా♦భంబు గలుగు
పౌరుషంబును వీడుమీ ♦ ప్రాణహితుఁడ.

మిత్రమా! ఇదియొక క్రతువాజి. దీనిం బట్టితివేని యజ్ఞంబునకు విఘ్నంబు గలుగును. తురంగము వెనుక వచ్చువారు గాంచితిరేని మోసమురాగలదు. మునికుమారులమైన మన మిట్టి కార్యంబు నే యరాదు. కావున నామాటలాలించి దీనిని విడువుము.

లవు—సఖుఁడా! ఎంతపిఱికివాఁడవు!

ఉ॥ శూరులె యున్న పట్టుఁడని ♦ సొంపుగ వ్రాసిరి పట్టమందు; నే
శూరుఁడఁగానొ యెల్లరును ♦ జూడగ దీనిని బట్టఁజాలనో
వీరవరేణ్యు లెవ్వరిటు ♦ వేఁ జనుదెంతురో చూచువాఁడ; న
వ్వారల శౌర్యధైర్యయుతు ♦ బాహుబలంబును; భీతియేటికిన్.

మిత్రమా భూసురులు భీతచిత్తులన్నమాట పోనిచ్చితివికావుగదా. నే నీక్రతువాజిని బట్టుటకు శక్తుండను గానను కొంటివా. శూరుఁడఁ

గనుకనే పట్టితిని. నా శౌర్య ధైర్య పరాక్రమాతిశయంబులు నా కుఁ దెలియవా !

ముని— మిత్రమా ! నామాట లాలింపుము. మునికుమారులమైన మన కిట్టికార్యములు సేయుట తగదు. నీవు బాలుండవగుటచే నిట్టిసాహసము సేయుచుంటివి. ఎవ్వరో యొక్క ధరాధీశునిచే నీతురంగం బు విడువఁబడినది. దానింబట్టుట శూరులగు క్షత్రియులకుం జెల్లును గాని మనకుఁ జెల్లదు.

లవు—ఎంత పొరఁబడితివి.

తే॥ గీ॥ శూరులేరైనఁ బట్టుఁడీ ♦ సొంపుమీర
నంచు లిఖియించి యుండెను ♦ నదిగో చూడు
క్షత్రియుండైన నేమి యా ♦ బ్రాహ్మణుండు
నైననేమి శౌర్యంబున ♦ కాత్మఁదలఁప.

ముని—నామాటలు నీవు వినుటలేదు. నీవిక్కార్యంబు సేయుటవల్ల నెంతయో ముప్పాటిల్లఁగూడును. అదియునుంగాక మీజనని యీసంగతి వినెనేని నీకై చింతింపఁగలదు. మఱియు, మనగురుండగు వాల్మీకి వరుణలోకంబునకుఁబోవుచు, నిన్నును నీయగ్రజుని గనుకొనుచు నీతో నరయుచుండుమని నాకుఁజెప్పి యేగెను ఇట్టికార్యము నీవు చేసితివని యతం డాలించెనేని నిన్నును నన్నునుగూడ నాగ్రహింపఁగలఁడు. రాజులతో మనకు బోరాటమేల. అదిగో ! అటుఁజూడుము. ఆవచ్చుచున్నబలగంబునుజూచినంతనే నాకు భీతిపుట్టుచున్నది. కావున నీవు ఘోటకంబును విడిచివేయుము. మనదారిని మన మాశ్రమంబునకుఁ బోవుదము.

లవు—

ఉ॥ పాఱులు భీతచిత్తులని ♦ పల్కెడిమాటలు సత్యమయ్యె ; నో
పాఱుఁడ ; యశ్వరాజమును ♦ బట్టితి శూరతయుంటఁజేసి యె

వ్వారిపుత్త్రుఁడవచ్చిన న ♦ వారణవిక్రమశౌర్య మేర్పడఁగ
ఘోరరణాంగణంబునను ♦ గూల్చెదఁ జీల్చెద వ్రేల్చెదఁగ వెసఁగ.

తే॥ గీ॥ నామలూరుకఁ జూరుండు ♦ భవ్యకృపను
నస్త్రవిద్య నాకును నేర్పె ♦ యలరినాఁడు
సకలభువనజాలంబులు ♦ శౌర్యమూని
యెత్తినచ్చిన భయమంద ♦ నింత యేని.

మిత్రమా! నీవు భీతినివిడుము, వాల్మీకిమహామునీంద్ర కృపాసమాసా
దితాస్త్ర విద్యాపిరాజితుండనగు నేను బట్టినపట్టువిడువను. ఏవీ
రుండు దీనిని విడిపించుకొనిపోవునో చూచెద. నీవేమియుఁ బలుకక
భీతిని బారదోలి నాయండ నుండుము.

ముని—(స్వగతము) అయ్యో! ఎన్నిచెప్పినను నీతఁడు నామాటవినకు
న్నవాఁడు. ఇప్పుడు నేనేమిసేయుదును. ఈవార్తఁ సీతనితల్లికైనను
దెల్పి యితని నీయుద్యమమునుండి తప్పించుదమన్న తగినంతకాల
ములేదు. ఈతనిని నొంటిగావిడిచి యేగవలసివచ్చెను. ఈయశ్వం
బును వెన్నంటివచ్చువీరులును, సమీపించుచున్నారు. అక్కటా!
ఏమియుప్పవాటిల్లునోకదా. (ప్రకాశముగా) సఖుఁడా! నామాటవి
ని ఘోటకంబును విడువుము. ఆవీరులుగూడ సమీపించుచున్నారు.

లవు—తే॥ గీ॥ వీరులెవరైన రానిమ్ము ♦ భీతిలేదు
భయమునీకున్నచో నాశ్ర♦మంబుజేరు
మయ్య; తురగము విడిపింప ♦ నరుగుదెంచు
వారివీక్షించి పిదపనే ♦ వత్తుగాక.

ముని—(తనలో) ఇతండెంతచెప్పినను వినఁడాయె. (ప్రకాశముగా) హి
తుఁడా “తాఁబట్టినకుందేటికి మూడేకాళ్ళు” న్నట్లు, నీవు పట్టినప
ట్టును విడువకున్న నేనేమిసేయఁగలవాఁడ. నిన్నొంటరిగ నిచ్చోట

విడిచి యాశ్రమంబును జేరుటకు నామనంబు సమ్మతించునా నిన్నె ప్పుడును నెడబాయకయుండవలసినదని గురుం డాజ్ఞయొసంగియున్న వాఁడు. గురునియాజ్ఞమీఱుదునా యేమైననుసరే నేనును నీవెంట నే యుండెద.

లవు—మిత్రమా! నీకేమియు భయంబులేదు. నాప్రక్కనుండుము.

(తెరలోఁ గలకలము)

ముని—ఏదియోశబ్దము వినవచ్చుచున్నది.

లవు—మరేమియులేదు. సైన్యముయొక్క కలకలము. అడుగో యెవ్వఁ డో యొక వీరుండు మనమున్న దెసకే వచ్చుచున్నాఁడు.

(అని తనబాణంబును సవరించుకొనును)

[వీరసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వీర—(ఎదుట దురంగంబును, దానింగట్టిన లవుని జూచి) ఏమిదీ! ఈతఁ డెవ్వఁడో బాలకుఁడు. క్రతుతురంగంబునుబట్టుట కెట్లుసాహసించెనోక దా. ఔరా! ఏమీ! ఈధైర్యము. అదుగో! శత్రుఘ్నుండు వె న్నంటివచ్చుచున్నాఁడు. (లవునిసమీపించి) ఓయీ! బాలకా! నీ వెవ్వరవు! మారాజచంద్రునిచే విడువఁబడిన యీక్రతువాజిని నీ వేలపట్టితివి. నీవు మునికుమారునివలెఁ గాన్పించుచుంటివే. దీనితో నీకేమిపనియున్నది.

లవు—ఓ వీరుఁడా! దీనితో నాకేమియుఁ బనిలేదు; కాని

తే॥ గీ॥ బిరుదపట్టంబుగట్టిరి ♦ వీరులున్నఁ
బట్టుడంచును దానిచేఁ ♦ బట్టినాఁడ
నీతురంగరాజంబును ♦ నిప్పుడేను
వింటివే కారణంబును ♦ వీరచరిత॥

వీర—బాలకా ! నీపలుకులకు నాకు నవ్వువచ్చుచున్నది. శూరులున్న
చో బట్టుడని వ్రాసియుండినమాట నిజమే. నిన్నుజూచిన నాకెంత
యు సందియంబగుచున్నది. నీవును నొకవీరుండవేనా !

లవ—నీవందుకుసందియంబందనేల. శూరుండనుగావుననే మీరాజుచే
విడువఁబడిన యీక్రతుతురంగంబును బట్టితిని.

వీర—తే॥ గీ॥ వయసునందునఁ బసివాఁడ ♦ వయ్యు మాట
లందు బెద్దవారలమించి ♦ యలరినావు
సంతసంబందినాఁడ నీ♦శౌర్యమునకు
విడువుమీ ఘోటకంబును ♦ బిన్నవాఁడ.

నీవింతచిన్నవాఁడవయ్యును నిట్లు నిర్భయముగఁబ్రత్యుత్తరమీయగల్గిం
దుల కెంతయో యానందమందినాను. మునికుమారుఁడవగు నీ కీక్రి
యాజితో నేమిపనియున్నది. తెలియక దీనిని బంధించితివి. ఇంక విడి
పెట్టుము.

లవ—ఓయీ ! నీవెవ్వరవో కాని తెలియకున్నది. ముందయ్యది తెలి
నపిమ్మట దగుప్రత్యుత్తరంబిచ్చెదను.

వీర—నేనెవ్వరినైననేమి ! ఈతురంగసంరక్షణోద్యోగంబునుబూని భూ
పాలుని తమ్మునివెంటవచ్చుచున్న సైన్యాధీశుఁడను. వీరసేనాభిధా
నుఁడ.

లవు—అట్లయిన నింకనేమి ! వీరసేనా ! ఈయశ్వంబును నేను విడుచు
టకుఁ బట్టినవాఁడనుగాను. శూరుఁడనుగావుననే పట్టితిని. మీచేత
నైనచో మీరు విడిపించుకొనుఁడు.

తే॥ గీ॥ బాలుఁడవు సాహసముఁబూని ♦ పట్టినావు
రమ్యమైనట్టి యజ్ఞతు♦రంగ మిపుడు
విడువుమంచును జెప్పగా ♦ విడువవేల
చేటుజేకూరునీ కింకఁ ♦ జెప్పుచుంటి.




ఈతురంగంబును నీవు బంధించుటంజేసి, యజ్ఞంబునకు విఘ్నంబు కలుగును. బాలుఁడవగుటచేఁ దెలియక దీనింబట్టితివి. కాకున్నచో నీవయసెంత. నీశూరతయెంత! ఇదియునుంగాక నీవు మునిబాలుండవు. క్షత్రియులవలె ధీరవాక్యంబులాడుచుంటివే.

లవు—ఓయీ! నేను మునిబాలుఁడనైననేమి! క్షత్రియుఁడనైననేమి. శూరతకు దీనితోఁ బనియేమున్నది. బాలుఁడనైననేమి! పరాక్రమముంటచేతనే తురంగంబునుబంధించితినని చెప్పితినే. మీభూపాలుండుసేయు యజ్ఞంబునకు విఘ్నంబుగలుగకుండఁ జేయగలిగినవారేని, దీనిని విడిపించుకొనుఁడు.

వీర—బాలకా! అదుగో భూపాలునిసోదరుండు వచ్చుచున్నాఁడు. ఆ తండిదిచూచెనేని నిన్ను దండింపకమానఁడు. కావున మారువలుకక పసితనపుఁబట్టును వీడి తురంగంబును విడువుము.

లవు—వామలూరుసంభవకృపాసమానదితాస్త్రవిద్యాధురంధరుండయిన యీలవుఁడు పట్టిన యశ్వంబును మరలఁ దా విడుచువాఁడుకాఁడు. చేతనైనచో విడిపించుకొని పొండు. మీ రాజానుజుండు వచ్చి నన్ను దండించునని పలికెదవేల. వీరగుణంబులుగలిగి, వీరుండవయియొప్పుచున్న నీవిరీతిఁ బల్కఁదగునే. పరాక్రమంబుగలిగినవాఁడవయ్యు, నశ్వంబును విడువుమని నన్ను బ్రతిమాలుకొనెదవేల. మీ భూపాలుండువచ్చునని నేను భీతిల్లి తురంగంబును విడుచువాఁడనుగాను. మీ భూవల్లభుఁడే కాదు చతుర్దశభువనంబు లొక్కపెట్టున నెత్తివచ్చినను విడువను. పరాక్రమంబుగలిగినవాఁడవేని విడిపించుకొనుము.

ముని—(తనలో) అక్కటా! లవుఁడు గడుతొందర పడుచున్నవాఁడే. ఈతని పలుకులీ వీరసేనున కలుకవుట్టించి యేమిసేయునోకదా.

వీర—బాలకా! నీవు సంగరంబన్న నేమియో యెఱుఁగవు. వలపుట్టి

పరిహాసవాక్యంబులఁ బల్కెదవు. క్రతువాజినిబట్టి విడువనని పట్టు బట్టుటకు నీ వెంతవాఁడవు. ఇంటికడ కేగి విద్యలంగఱచుచు నీతోటి బాలురంగూడి యాడుకొనుము.

లవు—ఓయీ! అనవసరప్రసంగ మేల కావించెదవు. బాలురతోడ గూడి యాడువాఁడనుగాను. నీబోంట్లతో రణక్రీడసల్పగలవాఁడనే. పురహరుం డరుదెంచినను నీ యశ్వరాజంబును విడువను. ఇంక నీ దారిని నీవుబొమ్ము. లేదేని, పరాక్రమంబుగలవాఁడవేని నాతోఁ బోరి దీనిని విడిపించుకొనుము.

వీర—బాలుఁడవగుటచే నీ కిన్నిసారులు చెప్పవలసివచ్చెను గాని లేకున్న చో దీనిని విడిపించుకొని పోవుట దుర్లభముకాదు. నీయందు దయవహించి యెంత చెప్పినను వినకున్నవాఁడవు. కానిమ్ము. నేనే విడిపించుకొనిపోయెదను. (అని గుఱ్ఱమును సమీపించుచున్నాఁడు)

లవు—వీరసేనా! దూరముగానుండుము. అశ్వమును నంటకుము. దగ్గరకు వచ్చితివేని ప్రాణంబులు దక్కవు.

వీర—తే॥ గీ॥ నీదుమాటల నాలించి ♦ నేను భయము
నందుదునటంచుఁ దలఁచితో ♦ యాత్మయందు
బాలుఁడవుగాన సైఁచి తీ ♦ లీలనిపుడు
లేకయుండినఁ గూల్పనే ♦ ప్రాకటముగ.

లవు—ఓరీ వాచాటా! ఏల వృథాప్రగల్భంబులు బలికెదవు. బాలుఁడను గావున సైరించితివా! బాలుఁడనో నీపాలిఁటఁ గాలుఁడనో చూచెదవుగాక. (అని తనశరంబులను సవరించుకొనును)

వీర—కనులు తెరువని పసికూనవైన నీవు నాతోఁ గయ్యంబు సేయ నెంచితివా? ఏమి నీకావరము. మీతల్లికిఁ బుత్రశోకంబుఁ గూర్పనెంచితివి కాఁబోలు. అట్లయినఁ గానిమ్ము.

లవు—ఓరోరీ! అసంబద్ధప్రలాపా! ఎందుకీగర్వపుమాటలు.

తే॥ గీ॥ చేతనైనవాఁడనయేని ♦ చేతఁ బూని
శరము నాతోడ ఘోరసం♦గరముచేసి
యశ్వమును విడిపించుక ♦ యరుగుమయ్య
పోటుబంటవు నీకిట్టి ♦ మాటలేల.

నీవుచూడగా మాటలవలననే యశ్వమును విడిపించుకొని పోఁదలచిం
నట్లు కనుపించుచుంటివి. మాటలతో నశ్వంబును విడుచువాఁడను
గాను. చేతగానిచో నీదారిని నీవుబొమ్ము.

వీర—ఓయీ! నీకుఁ బ్రాణంబులపై నాసలేదు కాఁబోలు.

లవు—నీవు ప్రాణంబులఁ దక్కించుకొనదలంచినవాఁడవేని యశ్వమును
విడిపించుకొనిపోవుతలంపు మానుము.

వీర—ఏమీ! నీవు హయంబును విడువవా?

లవు—పురహరుండు వచ్చినను మువ్వూటికిని విడువను.

వీర—బాలుండవని నీతోఁ గయ్యమొనర్చుటకు నాచిత్తంబు సందియం
బందుచున్నది. నిష్కారణంబుగ నాచేఁ బ్రాణంబులు గోల్పోయె
దవు సుమీ!

లవు—ఓరీ! ఆత్మశ్లాఘాపరాయణా! మాటలతో నేమిపని.

వీర—(తనలో) ఏమి! ఈబాలుని శౌర్యముచూడ నాకు మిగుల న
ద్భుతంబుగఁ దోఁచుచున్నది. ఇంత పసితనంబునందే యింత శౌర్య
మెట్లలవడెనో తెలియరాదు. ఎంతబ్రతిమాలిచెప్పినను వినఁడయ్యె.
అశ్వంబును వీడఁడు. అదుగో వెనుకనుండి శత్రుఘ్నుండుగూడ వచ్చు
చున్నాఁడు. ఆలస్యమగుచున్నది. ఈబాలునితోఁ బోరుటకు నాకు
సిగ్గుగనున్నది. ఏమైనను తప్పదు. (ప్రకాశముగా) బాలకా! అ
దుగో భూపాలుండుగూడ వచ్చుచున్నాఁడు. ఆతండు వచ్చెనేని
నీప్రాణంబులను దక్కనీయఁడు.

లవు—మూర్ఖుఁడా! ఇట్టిబెదరింపులకు భీతిల్లువాఁడనుగాను. నాహస్తం బుననున్న శరంబులుగూడ మీపై కరుదేర గడు తొందరపడుచున్నవి. నీశౌర్యము తేటతెల్లముగా దెలిసినదికదా. ఇంక మీభూపాలుని పరాక్రమంబు దెలియగలము.

వీర—(తనలో) ఇంక నీతని యెడల మాటలవలనఁ బ్రయోజనము లేదు. (ప్రకాశముగా) పోరొనర్చుటకే సంసిద్ధుఁడవై యుంటివా! గుఱ్ఱంబును విడువవా!

లవు—పలుమాటలేల! గుఱ్ఱంబును విడువను. రణంబునకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.

వీర—(తనలో) ముందుగ నీతనిపై రెండు శరంబులను బ్రయోగించి భయపెట్టెదను. (ప్రకాశముగా) అట్లయినచో నీయభీష్టమే తీర్చికొనుము. ఈశరంబును గాచికొనుము. (శరమును లవునిపైఁ బ్రయోగించుచున్నాఁడు)

లవు—ఇట్టివి సహస్ర శరంబులైనను లక్ష్యపెట్టువాఁడను గాను. ఇదిగో నీశరమును దుత్తునియలుగాఁ జేయుచున్నాను. చూడుము.

(వీరసేనుని శరమును ఖండిచు చున్నాడు)

వీర—(తనలో) అన్నా! బాలుఁడని యుపేక్ష జేయరాదు. ఇట్టి వానిని నే నెచ్చటను జూడలేదు. ఔరా! ఏమి వీని శరసంధాన చాతుర్యము. (ప్రకాశముగా) బాలకా! ఇంక నిన్నుపేక్షింపరాదు. అశ్వంబును విడువవా!

లవు—ముమ్మాటికిని విడువను.

వీర—అట్లయిన నీశరంబు నీయంతంబు జూచితీరును. (అని శరంబును బ్రయోగించుచున్నాఁడు.)

లవు—ఇదిగో నీశరంబును ఖండించినాను. నాచే విడువఁబడుచున్న

యీశరంబు దప్పక నీప్రాణంబులు తీయును. కాచికొమ్ము. ప్రాణ
మును బ్రియోగించుచున్నాఁడు)
వీర—హా! (నేలఁగూలును)

(తెరలో)

మన సేనానాయకుండు మునిబాలునిచే నేలఁగూలినాఁడు. అయ్యయ్యో!
సత్వరమ్ముగ నీమాట శత్రుఘ్ననితోఁ జెప్పుఁడు. కరితురంగంబు
ను బట్టి విడువకయున్న యీబాలుని శిక్షింపవలయును.

ముని—(లవునిజూచి) మిత్రమా! ఇప్పుడైనను నశ్వంబును విడిచి మన
దారిని మనముపోవుదము. రమ్ము. భూపాలుఁడుగూడ వచ్చుచున్న
ట్లున్నది. ఏమిహానివాటిల్లునోకదా.

లవు—హితుఁడా! నీవేమియు భయంబునందకుము.

తే॥ గీ॥ భయమునందువాఁడనుగాను ♦ మాధవుండు
వచ్చుచుండెనటంచును ♦ భావమందు
పురహరుండు, వచ్చునుగాక ♦ వరశరాళి
బఱపి; రణములో నిలతు దర్పంబుబెర్చి.

(తెరలో)

మ॥ జనపాలాగ్రణి వీడినట్టి ఘనయజ్ఞాశ్వంబునుంబట్టి, లో
ననుమానింపక యుంచుకైనను గడుఁ ♦ శౌర్యంబుదీపింపఁగా
మనసైన్యాధిపునిఁ వధించినమహా ♦ బాహాబలాఢ్యుండు, వా
నిని, ఘోరాజినిగూల్చువాఁడనిపుడే ♦ నిక్కమ్ముగా దప్పకన్.

ముని—మిత్రమా! లవా! జనపాలుఁడుకాఁబోలు వచ్చుచున్నాఁడు.
ఇంక నెట్లోకదా.

లవు—ఓయీ! భూపాలుండేకాఁడు. పురహరుండైనను రానిమ్ము. నే

ను వెనుదీయువాఁడనుగాను. నీవావంతయు స్వాంతంబున భయము నందకయుండుము.

అంత బైపద్యంబును జదువుచు శత్రుఘ్నుఁడు ప్రవేశించుచున్నాఁడు.

లవు—(బాణంబులుసవరించుకొని) ఓహో! యీతఁడేకాఁబోలు భూపాలునితమ్ముఁడఁట. ఇతనికిఁగూడ నాబాణచవింజూపింపవలయు. (ప్రకాశముగా శత్రుఘ్నునిజూచి)

మ॥ ఇటులేతెంచుచు చూచుమీనను; హయంబింపారగాఁబట్టి, మ
త్పటుశక్తింబొలియించినాఁడఁ గనుమీ బాహాబలాటోపతన్
ద్రుటిలో నీదగుదండనాథుని; మహాధీరత్వముం బూనితిన్
నిటలాక్షుం డిపుడెత్తివచ్చిననశే నే; నశ్వమున్వీడ; నీ
పటుసామర్థ్యముజూపి దీని విడిపింపం జూచుకొమ్మీ యిఁకన్.

శత్రు—(లవునిజూచి తనలో) ఈబాలుండేకదా తురంగంబునుబట్టి వీరసేనునివధించినది. ఆహా! ఏమి! ఇంతపసితనంబునందే యితని కీపరాక్రమం బెట్లలవడెనోకదా. మరియు మునిబాలునివలెఁగానుపించుచున్నవాఁడు. ఈతనితోఁ గయ్యంబొనర్చుట కేలనోకాని నామనంబించుక వెనుదీయుచున్నది. మాటలతో నీతనిని దురంగంబును విడువుమనిచెప్పెదను. (ప్రకాశముగా) ఓహో! బాలకా! నీవెవ్వరవు. ఈయశ్వంబు నేలబంధించితివి. మాదండనాయకుని వధించుటకుఁ గారణమేమి!

లవు—నే నెవ్వరినైననేమి. శౌర్యంబు నాయధీనంబు. "ఈయశ్వరాజాలికభాగంబున శూరులున్న బట్టుఁ" డని నాజిబిరుదపట్టంబును గట్టిరికదా. ఆకారణంబున, శూరుండనగుటంజేసి నేను దీనిని బంధించితిని. మీసేనాధీశ్వరుండు దీనిని విడిపించుకొనుటకు యత్నించి నాతో రణంబొనర్చి యంతకాలయంబును బ్రవేశించినాఁడు.

శత్రు—(తనలో) ఈతనిపలుకులు నాకద్భుతము జనింపఁజేయుచున్నవే. ఔరా! ఏమి వీనిసాహసము. బాలుఁడయ్యును గడుశౌర్యమున నిలిచి ప్రత్యుత్తరంబిచ్చుచున్నాఁడే. (ప్రకాశముగా) బాలకా! నీధైర్యంబునకును సాహసంబునకును మెచ్చితి. మునిబాలుఁడవైన నీకీతురంగముతో నేమిపనియున్నది. ఇంకనీవు దీనినివిడిచి నీదారినినీవుపొమ్ము.

లవు—నాదారిని నేనేగుటకు దీనినిబంధించలేదు. దీనినివిడిపించుకొని పోవునంతటి యవసరము నీకులేనిచో నీదారినినీవుపొమ్ము. శూరుఁడనుగావున దీనింబట్టితి. ఈతురంగంబు నీకుంగావలయునేని నీశౌర్యంబునుజూపించి తీసికొనిపొమ్ము.

శత్రు—తే॥ గీ॥ బాలకుండవు; నీతోటి ♦ వారిఁగూడి
యాటలాడుకొనఁగ వేగ ♦ నరుగుమయ్య
రాజచంద్రులతోడ బో♦రాటమేల
తగదు నీకిద్ది యింటికిఁ ♦ దరలుమయ్య.

ఉ॥ బాలుఁడవీవు భూపతుల ♦ భంగులెఱుంగ వభంగసంగరా
భీలురమాదు మింటికడ ♦ విద్యలనేర్చుచునుండ కిప్పుడీ
యాలమిదేల మాకు సరి♦యై నిలువంగను నేర్తువే; ధరా
పాలునిచేత వీడఁబడు ♦ భవ్యహయంబును బట్టితేటికిన్.

తే॥ గీ॥ బాలకుండవుగాన నీ♦పైన నలుక
బూనఁగా బుద్ధినాకిప్డు ♦ పుట్టదయ్యె
నాదువాక్యములాలించి ♦ వాదువీడి
యశ్వమునువీడి యింటికి ♦ నరుగుమయ్య.

లవు—ఏమి! నీపలుకులు. ఉత్తమక్షత్రియవంశ ప్రావిర్భూతుండవై యుండియు నీరీతిని క్షత్రియోచితంబుగాని పలుకులు పలికెదవేల. ఓయీ! నన్నునింటికేగి విద్యలనేర్చుకొనుమందువా! చూడుము.

ఉ॥ ఇంటికిఁ బోవనేటికి; నహీనపరాక్రమ శౌర్యవృత్తి ము
క్కంటియె వచ్చినన్ విడువ ♦ గాఁ దలపోయను నశ్వరాజమున్
బంటుతనంబు జూపి బహు ♦ భంగులఁ బోరెద యుద్ధమందు; నీ
వంటి పరాక్రముం డటులు ♦ పల్కుటజెల్లునె వీరధర్మమే.

ఓరాజా! నీవు నన్ను హయంబును విడువుమని బ్రతిమాలు కొందువే
ల. నీవు పరాక్రమవంతుఁడవు కావా!

శత్రు—(తనలో) ఈతని యెడల నింకమంచిమాటలు పనికిరావు. (ప్ర
కాశముగా)

తే॥ గీ॥ బాలుఁడవు గాన నీరీతిఁ ♦ బలికినాఁడ
వేఁడిశరముల నీపైన ♦ విడువలేక
మంచిమాటలచే బ్రతి ♦ మాలినాఁడఁ
గానహయమును విడువుమీ ♦ కలహముడిగి.

నాపలుకులు నీవాలింపకుంటివి. నీవు బాలుండ వగుటచే, నీతోఁ గయ్య
మొనర్చుటకు నామనంబు సమ్మతింపక పోవుటచే నీయందుఁ గృప
వహించి యట్లు పలికితినిగాని నీకు భీతిల్లికాదు. ఇదిగో నాకడసారి
పలుకులను వినుము మారాజ చంద్రునిచే విడువబడిన యశ్వంబు
ను బట్టుటకునీ వసమర్థుండవు. మాతోఁ బోరుటకు నీవు పసివాఁడవు.
నీవు మాచే నీల్గితివేని నీతల్లి నీకై యెంతయో శోకించును. నే
నును బిడ్డలం గన్నవాఁడ నగుటచే నిన్ను గూలనేయుటకుఁ జేతులురా
క యిట్లు చెప్పుచుంటిని. ఇంక నీవీ యశ్వంబును విడువుము. లేనిచో
నీకెంతయైనను హాని వాటిల్లును.

లవు— ఓరోరీ! ఆత్మ శ్లాఘా పరాయణా!

మత్తకోకిల. నీవుకాదిఁక నిన్నుబోలిన ♦ నీచులెందఱువచ్చినన్
జేవజూపుచు సంగరంబునఁ ♦ జెచ్చెరన్ వధియించెదన్

గావరంబునుబూని యిట్టులు ♦ కారు లర్వగలాభమే
చావు దగ్గరజేరె నిన్నును ♦ సత్యమియ్యది దుర్మతీ.

ఓయీ! నీప్రతాపవాక్యంబులకు భీతిల్లువాఁడనుగాను. చేతనైనచో నా
య్యంబొనర్చి యజ్ఞాశ్వంబును విడిపించుకొనిపొమ్ము.

శత్రు—“ గుఱ్ఱమువచ్చి పిల్లను వెక్కిరించె ” నన్నట్లు నిన్నూరకున్నకొలఁ
దిని సంభాషణంబునకు విజృంభించుచుంటివే. ఇంకనిన్ను సైఁపరాదు.
ఇంతవఱకును బాలుండవని సైరించియూరకుంటిఁగాని లేకున్నచో ని
న్నీపాటికి గాలునివీటికిఁ బంపియేయుందును.

లవు—నీవా నన్నుదాఁకువాఁడవు. వృథామాటలతో నేమి ప్రయోజన
ము. ఇదే నాశరంబునకుఁ బ్రత్యుత్తరంబిమ్ము.

(శరమును బ్రయోగించుచున్నాఁడు)

(ఇరువురును యుద్ధముసేయుచున్నారు)

శత్రు—(తనలో) అబ్బా! ఏమి! ఈబాలునిశరసంధాననైపుణ్యము. ఇ
ట్టివానిని నేనెచ్చటను జూచియుండలేదు. బాలుఁడని యూరకొన్న
చో నాకేమోసమువచ్చును. ఇంకనేనూరకొనరాదు. (ప్రకాశముగా)
ఇదిగో! ఈశరంబు నిన్ను దప్పక నేలంగూల్చుఁగాక.

(బాణమును విడుచుచున్నాఁడు)

లవు—హా! (నేలం బడుచున్నాఁడు)

ముని—(తనలో) అయ్యో! ఎంతమోసము వచ్చెను. హా లవకుమారా!
నేనెంతచెప్పినను వినకపోతివికదా. అయ్యో నిన్నుగూర్చి మీతల్లి న
న్నడిగినచో నేనేమనిచెప్పువాఁడ. (ఇంచుకయూరకుండి) అక్కటా!
నేనీరీతిని విలపించినచో నేమిప్రయోజనమున్నది. సత్వరంబుగనేగి
యీతనితల్లికీసంగతిఁ దెలిపెదఁగాక. (నిష్క్రమించుచున్నాఁడు)

శత్రు—ఇంక నేనాలశింపనేల. హయమునువిడిచి, యీబాలుని రథము
పైఁ బెట్టుకపోయెదఁగాక. (నిష్క్రమించుచున్నాఁడు)

రంగము—వాల్మీకాశ్రమము.

సీత ప్రవేశించుచున్నది.

సీత—(విచారముతో) అన్నా! లవుం డెంతటిపనిజేసెను. అక్కటా! మునికుమారులం డెంతవారించినను నాలింపక, యాశ్రితతురంగంబు ను బంధించి, యీరీతినయ్యెనా! అయ్యో! లవకుమారా! నాథునిచే నడవులకుఁ బంపబడి యిట్లుంటిననియైనను జింతింపక, మిమ్ములఁజూచుకొని ధైర్యము వహించి, కాలము గడపుచుండగా నా కిట్టి శోకంబు గల్పించితివా? తండ్రీ! ఆశ్రితతురంగంబు నేలబంధించితివి? వలదని మునిబాలుం డెంత చెప్పినను వినకపోతివా? ఆ భూపాలునితో నేల పోరాడితివి. ఏభాగ్యభోగంబులు లేకపోయినను మీరే సర్వంబని తలంచియుండగా సింతలో నిట్టులయ్యెనా? సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబును ధిక్కరించు నీమోమును జూచినంతనే యెట్టివాఁడయినను ముద్దుబెట్టుకొనక మానఁడుకదా. అట్టిచో స్వాంతంబున నించుకయైనను గరుణబూనక నీపైన నబ్భూపాలునకుఁ దనశరంబుల విడుటకుఁ జేతులెట్లాడె. వరుణలోకంబున కేగిన మాతాతయగు వాల్మీకిమహర్షీంద్రుఁ డేతెంచి లవుఁడేడియని యడిగిన నేనేమని చెప్పగలను. నీయన్నయగు కుశుం డేతెంచు వేళయైనది.

తే॥ గీ॥ ముద్దుతమ్ముఁ డేడంచు స♦మ్మోదముమీఱ
నడుగునప్పుడు నన్నకే ♦ మనెడిదాన
నక్కటా తోఁపదయ్యెనా ♦ యాత్మయందుఁ
దండ్రి! ననుబాసి యరిగితే ♦ ధరణియందు.

నాయనా! లవా! సప్తద్వీపసముద్రముద్రితమహీచక్రంబు బరిపాలించెడి శ్రీరామచంద్రునకుఁ బుత్రుండవై, మహామునిశ్రేష్ఠుండగు

వాల్మీకికిఁ బ్రియశిష్యుఁడవై యలరారియు నీరీతి నొక్కభూపా
లునిచే గాసినొందితివా! అయ్యో! దయలేక నాభూపాలుండు నీ
పై బాణంబులు గురిపించునప్పు డెంతబాధనొందితివో కదా. న
న్నును నీయన్నను నేమని తలంచుకొంటివో కదా. (విచారించు
చున్నది)

కుశుఁడు ప్రవేశించుచున్నాఁడు

కుశు—(తనలో) ఏమిదీ! ఆశ్రమంబంతయుఁ జిన్నవోయినట్లున్నది.
మునిబాలురందఱును నన్నుఁ జూచి వేదపఠనంబుమాని తలలువంచు
కొనియున్నారు.

తే॥ గీ॥ నన్నుఁ జూచినతోడనే యన్న! వచ్చి
తో! యటంచును మిగుల సంతోషమతిని
నెదురుగావచ్చు తమ్ముం డిదేల నేఁడు
రాకయుండినవాఁడు కారణ మదేమొ.

(నాలుగుమూలలఁ జూచి) ఇదిగో! మాజనని యిచ్చట నెందులకో వి
చారించుచుఁ గూరుచున్నది. ఈమెం దర్శించి చింతకుఁ గారణంబ
రసెదఁ గాక. (సీతను సమీపించి) తల్లీ!

సీత—కుమారా! వచ్చితివా!

కుశు—అమ్మా!

మ॥ ఘనగర్భాంతగ చంద్రబింబమువలెన్ గన్పట్టె నీమోము, నీ
కనులన్ బాష్పజలంబు గాల్వకరణిన్ గట్టెంగఁ, జింతింపఁ గా
రణమేమమ్మా! ప్రియసోదరుం డెట్టకుఁ గార్యంబుమాని తా నేగెనో
జననీ ధైర్యముబూని చెప్పుము నమస్కారంబు గావించెదన్.

సీత—నాయినా! ఏమని చెప్పుదును. ఏదియో కౌతుకతరంగంబట.

దాసిని లవుండు బంధించెనఁట. అంతట నొక్క భూపాలుం డెంత చెప్పినను లవుండు దానిని విడువకుండుటఁ జూచి యతం డాగ్రహంబు బేర్చి మనలవునితోఁ గయ్యంబునకుఁ దలఁపడి నేలంగూలనేసి రథముపైఁ బెట్టుకొని యేగుచున్నాడఁట.

కుశు—అక్కటా! నాయనుఁగుఁదమ్ముని నాభూపాలుం డట్లు కావించెనా! హా! తమ్ముఁడా! శౌర్యరాశీ! వాల్మీకిమహామునీంద్రప్రియశిష్యచూడామణీ! ఆశ్రితువాజిని బంధించుటకు నీకేల యవసరముకలిగెను. అయ్యో! లవా! నన్ను బాసిపోతివా?

తే॥ గీ॥ పూర్ణచంద్రునిబోలు నీ మోముఁ జూచి
ముద్దు బెట్టుకొనెంతు రే పురుషులైన
నట్టి నిన్ను రణమందు దున్నాడనెట్లు
సమ్మతించెను చిత్తంబు దుర్మధునకు.

(తనలో నాలోచించి) ఏమీ! నాతమ్ముఁ డొకనిచే మడియువాఁడా! నాచిత్తంబు సందియంబందక యున్నది. (ప్రకాశముగా) తల్లీ! నాతమ్మునిఁగూర్చి నీవు చింతింపవలదు. ఆతఁడు మూర్ఛిల్లియుండునుగాని యొకరిచే మడియువాఁడుకాఁడు. నేనిప్పుడే యేగి నాతమ్ముని రథముపైఁ బెట్టుకొనిపోవుచున్న యాక్షితిపాలున కడ్డుపడి, ఘోరసంగ్రామమునాచరించి వానిని విగతజీవునింగావించి తమ్ముని దోడ్కొనివచ్చెద.

సీత—కుమారా! నీవుగూడ నాభూపాలునిపైకిఁ బోవుచుంటివా. లవునికై చింతపడుచున్న నాకు మరింత సంతాపంబును గలుగజేయనెంచితివా! నాయినా! నీవేగవలదు.

కుశు—అమ్మా! వీరమాతవగు నీవిట్లు భయమునందఁదగునా! మాపరాక్రమంబు నీవెఱుంగజాలక యిట్లంటివి.

తే॥ గీ॥ సకలభువనంబు లొకటిగా ♦ బ్రకటితముగ
నెత్తివచ్చిన వచ్చునా ♦ వంతయైన
భయమునందను గణమందు ♦ భయమదేల
ననుజుc దోడ్కొనివచ్చెద ♦ నమ్ముమమ్మ.

తల్లీ! నీవింకc జింతవిడిచి నాకు దీవనలిచ్చి పంపుము.

సీత—కుమారా! విజయలక్ష్మీలాలితుండవై యరుదెంచెదవుగాక.

కుశు—నీయమోఘాశీర్వచనంబు ఫలించుcగాక. జననీ! నీపాదాబ్జంబుల కిదే నమస్కారములు. ఇcక నేcబోయివచ్చెద.

సీత—వత్సా! మంచిది.

(కుశుcడు నిష్క్రమించుచున్నాcడు)

సీత—ఎంతధైర్యమువహించినను లవునిసంగతిని గూర్చిమాత్రము సంతాపము శాంతిగాకున్నది. నిత్యసత్యనిరతుండును, మునిజనపూజితుండును నగు శ్రీరామచంద్రుని కుమారులగు కుశలవుల కేహానియు వాటిల్లకుండుcగాక.

(నిష్క్రమించుచున్నది)

ఇది చతుర్థాంకము.





# శ్రీరామాశ్వమేధము.

## పంచమాంకము.

### శ్రీరాముఁడు—భరతుఁడు.

శ్రీరాము—(విచారముతో) తమ్ముఁడా! భరతా! అట్లాముని బాలుని మూర్ఛిల్లఁజేసి రథంబుపైఁ బెట్టికొని వచ్చుచున్న మనశత్రుఘ్నుని వే రొక మునిబాలుండు దాఁకి ఘోరంబుగ సమరంబు సేయుచుండ, తమ్మునికి సాయము సేయఁదలంచి సుమిత్రాకుమారునిఁ గూడఁ బంపితి మి. ఆహా! ఏమిది. ఆమునికుమారుండు దర్పంబేర్చి పోరాడు చుండ, మూర్ఛ మునింగియున్న యతఁడు లేచి తనసోదరునకు సహా యపడగా నయ్యిరువురును గలిసి, లక్ష్మణశత్రుఘ్నులను నేలకుం గూలనేసిరికదా. కట్టా! ఏమిసేయుదును. భుజబలపరాక్రమసంప న్నులగు తమ్ములీరీతినగుదురని యెన్నఁడును గలనైనం దలంపనైతి నే. హా తమ్ముఁడా! లక్ష్మణా! శత్రుఘ్నా! మీ యిరువురకును నే ట్టిపాటు సంభవింపఁజేసితిని. ఈయశ్వమేధక్రతు వాచరించుట యి ట్టి మునికుమారుల పొట్టను బెట్టుటకే కాఁబోలు! ఈయాగం బొనరించుటకు నా కేలబుద్ధిపుట్టెను? అయ్యో! మీకింతపాటు దెచ్చి మఱదండ్రి మొగంబును నేనెట్లు జూడగలను తల్లులను నే మని యూరడింతును. మిమ్ములను గోలుపోయిన నాతను వీభూమి పై నుండనేల!

భర—అగ్రజా! చింతింపక ధైర్యము బూనుఁడు. ఆలక్ష్మణశత్రు

ఘుష్టు లొకరిచే రణరంగంబునఁ గూలువారుకారు. వారు మూర్ఛ
మునింగియుందురు. ఇప్పుడే మనమేగి రిపులజయించి, తమ్ములను
దోడ్కొనివత్తము.

రాము:——ఇంక నెక్కడితమ్ములు. ఎక్కడి జయము.

తే॥ గీ॥ సీత విడనాడినందుకే ♦ చింతమదిని
దాల్చి, యీరీతి నక్కటా ♦ తనరుచుండ
నింతలో నిది చేకూఱె ♦ నేమిసేతు
నయ్యొ తల్లులమొగముల ♦ నరయుటెట్లు

తే॥ గీ॥ లవణుఁడాదిగ దైత్యుల ♦ భువిని దర్ప
మేర్చి సాహసంబున వధి♦యించెనట్టి
కైకసుతుఁడు తమ్ముండు స్వ♦ర్గంబుజేరఁ
జింతనొందక యుందునే ♦ స్వాంతమందు.

తే॥ గీ॥ వనములకు నన్నుఁబాయక ♦ వచ్చి; భక్తి
మీఱగను సేవజేయుచు ♦ మెలఁగినట్టి
యనుఁగుఁదమ్ముండు లక్ష్మణుం ♦ డకట నేఁడు
మునితనయుచేతఁ గూలెఁగా ♦ భూతలమున.

భర——అన్నయ్యా! నేఁజెప్పుపల్కులను, విని ధైర్యము నుబూనుఁడు.

తే॥ గీ॥ అంత బలశౌర్యములచేత ♦ నలరినట్టి
సోదరుల్ మునిబాలుచే ♦ ముగ్గురు ...
నమ్మనర్హామె యామాట ♦ నెమ్మనమున
మూర్ఛయే పొంది యుందురు ♦ భూరిచరిత.

ఇంక సంశయింపకుఁడు. ఇదిగో మన మామవిలాల [illegible]
సమీపించినాము. సోదరుల కట్టి పాటుదెచ్చిన [illegible]
రాజకిం బలియిచ్చి, తమ్ములను దోడ్తెచ్చెద.

రాము—(కోపముతో మునిబాలురనుద్దేశించి) ఓరోరీ! మునిబాలులారా! నాసోదరుల కిట్టి పాటుదెచ్చిన శూరులగు మిమ్ము భస్మంబుగావించుటకు రామక్రోధానలంబు నిమిత్తమాత్రము సుండీ.

అంత కుశలవులు ప్రవేశించుచున్నారు.

కుశు—తమ్ముఁడా! ఆహావంబునఁ దమ్ములను మూర్ఛమునుంగఁజేసితి మను కోపంబునఁ గాఁబోలు వీరి సోదరు లిరువురును మనపై కెత్తివచ్చినారు.

లవు—అన్నయ్యా! రానిమ్ము. వీరు మాత్రము మనల నేమిసేయగలరు. ఆతమ్ముల కెట్టిచేటు చేకూఱెనో వీరికిని నట్టిదే ప్రాప్తించును.

చ॥ పురమారుఁ డెత్తివచ్చినను ♦ బూర్ణభుజావిభవ ప్రసిద్ధికిన్
శరముఁ లంజిమ్మి గెల్చెదను ♦ సంగరమందున; వీరలెంత; సో
దర; కనుచుండిమీ యిపుడె ♦ దర్పము నన్ వెనుదీయకింతయున్
నరపతులన్ వధించెద మనంబున సందియ మందనేటికిన్.

కుశు—తే॥ గీ॥ సకలభువనంబు లేకమై ♦ శౌర్యగరిమ
వచ్చినను గాని రానిమ్ము ♦ భయమునంద
నస్మదీయబాణాగ్నికి ♦ నాహుతులుగఁ
జేయువాఁడను వీరిని ♦ శీఘ్రగతిని.

ఇదిగో! వారితోఁ బోరాడుటకు మనము సంసిద్ధులమై యుంటిమి. మదస్త్రంబులుగూడ వారిపై కేగఁ దొందరపడుచున్నవి.

భర—(రామునితో) సోదరా! అటుఁజూడుము. మనసోదరుల కెగ్గునల్పినబాలురు వారే. అదే ఆవృక్షంబుక్రింద నున్నారు.

రాము—ఆహా! తమ్ముఁడా!

తే॥ గీ॥ బాలకులు వీర లెబ్భంగి ♦ బవరమందు
నిలిచి; వీరచరిత్రులై ♦ చెలఁగినట్టి

యనుఁగుదమ్ముల దర్పంబు ♦ నడఁచినారు
వింతదోఁచెను నామది ♦ వీరసాన్య.

రమ్మఁడా! నేనిచ్చటనుండెద. నీవు వారికడ కేగి సామవాక్యంబులచే వారినోడంబడజేసి యశ్వమును గొనుము. వారి ముఖబింబంబులఁజూడఁ వారితోఁ గయ్యంబొనర్చుటకు నాచిత్తంబు సమ్మతింపకయున్నది.

భర—అగ్రజా! భవదాజ్ఞ ననుసరించెద. (కుశలవులంజేరి) బాలకులారా!

తే॥ గీ॥ సకలలోకైక విఖ్యాత ♦ చక్రవర్తి
యశ్వమేధంబుసేయగ ♦ నాత్మనెంచి
విడిచినట్టి యశ్వము నవి♦వేకులగుచుఁ
బట్టినా రెంత ధైర్యమో ♦ బాలులార.

అశ్వమును విడిపించుకొనఁదలంచి వచ్చిన మాతమ్ములకుఁగూడ నెగ్గు సలిపితిరే.

కుశ—(భరతునిజూచి) నీసోదరులు మాచేఁ గూలుటనాలించియు భయమునొందక తిరిగి మాకడ కేమిలవచ్చితివి. ప్రాణములపై నాసలేదా!

భర—ఓహో! బాలులారా! కన్నును మిన్నును గానక మీరీరీతిఁ బల్కుట పాడిగాదు. సుక్షత్రియవంశసంభూతులమును, వీరులమునునగు మాతోడ మీరెట్లుసమరం బాచరింపఁగలరు.

లవ—క్షత్రియులమో, వీరులమో పాఱులమో, సమరరంగంబునఁ దెలియగలదు. వృధావచనంబులతో నేమిపనియున్నది. శరంబులను గరంబులధరించితివికదా. ఇంకఁ బోరాటంబునకుఁ గడంగుము.

భర—మిమ్ముఁజూచిన నాకెంతయుఁ జాలిపుట్టుచున్నది. పసిబాలురగు మిమ్ము వధించుటకు నాకుఁజేతులురాకయున్నవి. మాచే మీరుగూలి

తిరేని మీతల్లి మీకై యెంత యోవిలపించును. ఇంతవఱకును మీ రాచరించినదుండగంబులును, మీరాడినపలుకులును సైరించెదను. క్రతువాజిని వీడుడు.

కుశు——ఛీ! క్షత్రియానర్హంబులగు పలుకులుపలికితివే. మమ్మీరీతిని బ్రతిమాలెదవేమి! శౌర్యంబు లేదా! లేక ధనుర్బాణంబులు లేవా!

భర——(కోపముతో) ఆ! దురాత్ములారా! ఆత్మశ్లాఘాపరాయణులారా! ఏమంటిరి, క్షత్రియానర్హంబులగుపలుకులు బలికితినా! కానిండు. చూచెదరుగాక. ఇంకమిమ్ము సైరింపఁజాల.

రాము——(తనలో) ఓహో! తమ్మునకును, నబ్బాలురకును వాగ్వాదంబు జరగుచున్నదే. తుదకియ్యది పోరాటంబుగనే పరిణమించునట్లున్నది. నేనును నేగెద. (భరతునిసమీపించి బాలురంగనుంగొని) బాలులా రా! మీనివాసంబెద్ది నామంబులేవి. కులంబెయ్యది.

కుశు——పోరాటంబునకరుదెంచిన నీకు మాకులగోత్రనామ విమర్శనంబుతో నేమిపనియున్నది.

రాము——(భరతునిజూచి) తమ్ముడా! భరతా! వీరిరూపంబులుజూడ, భూసురులనితోఁచును. కాని వీరిశౌర్యసాహసంబులుజూడ, క్షత్రియులని తోఁచుచున్నది. బాలురగుటచే వీరినివధింపఁ జేతులురావు. సామవాక్యంబులచే సాధ్యమగునంతవఱకు బ్రతిమాలుకొందును. (ప్రకాశముగా) వత్సలారా! వృథావాగ్వ్యయం బేలకావించెదరు. మిమ్ముఁజూచిన నాకెంతయు జాలియగుచున్నది. మీకుఁగావలయునేని మఱొక్కతురంగముగాని, కోరినభూషణంబులుగాని యిత్తును. కావున నింక వేరుపలుకక యశ్వంబును విడువుఁడు.

లవు——సప్తద్వీపసముద్రముద్రిత మహీచక్రంబుబాలించు చక్రవర్తివి గావున దానధర్మంబులనాచరించఁగలవు. మాకవియన్నియునేల? ర ణభిక్షంబెట్టుము మాకదియేచాలును. చతుర్దశభువనంబులు నొక్క

పెట్టిననెత్తివచ్చినను మేము గుఱ్ఱంబును విడువము. ఇదియే కడసారి మాట.

రాము—నిష్కారణముగ నాగ్రహముదెప్పించి నాచే మడియకుఁడు.

కుశు—నీవు మాచేమడిసెదవో లేక నీచే మేముమడిసెదమో యయ్యది నీవెట్లునిరూపింపఁగలవు. ఇట్టిమాటలలో నేమిపనియున్నది. గుఱ్ఱంబునుమాత్రము మేము విడువము.

రాము—ఏమీ! హయంబును విడువరా!

కుశు—ముమ్మాటికిని విడువము.

రాము—(భరతునితో) భరతా! ఇంకఁగార్యంబులేదు. కానిమ్ము బాలురు తత్ఫలంబును గుడిచెదరుగాక. ఓహో బాలులారా!

తే॥ గీ॥ భవ్యక్రతువాజినీరీతిఁ ♦ బట్టి యిట్లు
వీరబలపరాక్రమమున ♦ వెలుఁగుమిమ్ము
వేగ దున్పఁగా శరమును ♦ విడుచుచుంటి
మీదుప్రాణాళి బాపును ♦ మేటిశరము.

(శరంబు విడువఁబోవును)

(తెరలో తాళుము తాళుము)

తొందరగాఁ బరమేశ్వరుఁడు ప్రవేశించును

పర—(రాముని హస్తంబులో జట్టుకొని) శ్రీరామచంద్రా! ఇదియేమి న్యాయము.

రాము—(పరమేశ్వరునిజూచి) ఓహో! పరమేశ్వరా! నాయెడ బ్రీసన్నుండవై యరుదెంచినని న్నభినందించుచున్నాఁడ.

పర—రామా! కన్నకుమారులం జంపదలంచితివే. నీశౌర్యము వీరిపై నా చూపించుట.

రాము—మహాత్మా ! వీరు నాకుమారులరా !

వాల్మీకి—(ప్రవేశించి) సత్యము సత్యము లోకాపవాద బాపుకొనుటకై నీవు సీతను నరణ్యాంబులయందు విడువ, నామె నాచేఁగొనిపోబడి, మ దాశ్రమంబున రక్షింపబడుచు నిన్కుమారులనుగాంచెను. సకలగు ణంబులయందును నిన్నుఁబోలిన యీతనయులను వీరుజేసినతప్పులను మన్నించి రక్షింపుము. అదిగో ! సీతగూడ వచ్చుచున్నది.

సీత—(రామునిజూచి) ప్రాణేశ్వరా ! భవదీయపాదారవిందంబుల కీసేవ కురాలు నమస్కరింపుచున్నది.

రాము—కల్యాణమగుఁగాక.

(సీత వాల్మీకికిని బరమేశ్వరునకును నమస్కరించును)

రామ —(తనయులంజూచి) ఆహా ! కుమారులారా ! మీ కెంతహాని తేఁ దలంచితిని. అన్నా ! తెలియకపోయితిఁగదా !

కుశు—తండ్రీ ! నీయెడ మేము మహాపచారంబుగావించితిమి. పినతం డ్రులనుగూల్చినమహాపాతకులము. నీవు జనకుండవని తెలియనేరక పోయితిమి. మాతప్పుసైరించి రక్షింపుఁడు. (కుశలవులు రామునిపాద ములపైఁబడుచున్నారు)

పర—వత్సలారా ! చింతింపకుఁడు. లక్ష్మణశత్రుఘ్నులు సజీవులయి యి టువచ్చుచున్నారు.

[లక్ష్మణశత్రుఘ్నులు ప్రవేశించి పరమేశ్వరునకు నమస్కరింతురు]

కుశు—మహాత్మా ! పరమేశ్వరా ! మీమూలంబున మాతండ్రినిగనుం గొనుటయు, రణంబునఁ గూలిన పినతండ్రులు సజీవులగుటయుఁ గలి గినది. ఇట్టి మహోపకారం బాచరించిన నీ కనేకవందనములు.

వాల్మీ—రామా ! లోకాపవాదకై విడిచిన సీతయం దేదోషంబును లేదు. ఆమెను నీవు మరల గ్రహించుటయే నాకోరిక.

పర—అవశ్య మట్లు సేయవలసినదే.

రామ:—గురుల యాజ్ఞను మీరుదునా!

పర—రఘునందనా! సీతను గ్రహించితివి. నిఖిలలోకైకవీరులగు తనయులంగాంచితివి. క్రతుసమాప్తి యొనరించు భాగ్యంబుగంటివి. ఇంక నేమికావలయు.

రాము—దేవా! నీకృపారసంబుదప్ప నాకేమికావలయును. మీయందఱి సమక్షమందునఁ గుశలవులకుఁ బట్టాభిషేకంబు సేయవలయునన్న నాకోరిక ఫలించుఁగాక.

పర—అట్లేయగుఁగాక.

(అందఱును నిష్క్రమింతురు)

పంచమాంకము.

సంపూర్ణము.

